

భారత ప్రభుత్వ సమ్మత దృక్సిద్ధాంత

శ్రీ హేమలంబ నామ సంవత్సర

# గ్రహభూమి

వాస్తవ వైజ్ఞానిక శాస్త్రీయ పరిశోధనాత్మక అంతర్జాతీయ తొలి తెలుగు ముహూర్త పంచాంగం

2017 2018



న్యూయార్క్, లండన్, లాస్‌ఏంజిల్స్ పంచాంగము - శుభముహూర్తములతో...





PRANATHI TV
నిత్య జ్యోతిష ప్రవచకులు

పండిత శ్రీపొన్నలూరి శ్రీనివాస గార్గేయ దైవజ్ఞ

మోహన్‌పబ్లికేషన్స్, కోటగుమ్మం, రాజమహేంద్రవరం

# గ్రహభూమి

## శ్రీ హేమలంబ నామ సంవత్సర

భారత ప్రభుత్వామోద గణిత వాస్తవ, వైజ్ఞానిక, పరిశోధనాత్మక, శాస్త్రీయ

తొలి తెలుగు అంతర్జాతీయ పంచాంగం

**2017** **2018**




( న్యూయార్క్, లండన్, లాస్ఏంజిల్స్ శుభసమయాలతో )


పంచాంగకర్తలు

**దైవజ్ఞ పొన్నలూరి శ్రీనివాస గార్గేయ**

**&**

**కుమారి నందినీ గార్గేయ**

ప్లాట్ నెం 149, రోడ్ నెం 11, అలకాపురి, కొత్తపేట, రంగారెడ్డిజిల్లా

హైద్రాబాద్ 9348032385 (only 11 am to 3.00 pm)



మోహన్ పబ్లికేషన్స్ granthanidhi.blogspot.in mohanpublications.com కోటగుమ్మం, రాజమండ్రి : (0883) 2462565




# విషయసూచిక

| విషయములు | పేజి నెం. |
|---|---|


| విషయములు | పేజి నెం. |
|---|---|
| గ్రహభూమి పంచాంగ విశిష్టత | 3 |
| ప్రస్తుత సంవత్సరం పేరేమిటి? మార్చి 28నే శ్రీ హేమలంబ ఉగాది | 4 |
| ఉగాది పర్వదినంపై ధర్మశాస్త్ర నిర్ణయాలు | 5 |
| ధర్మప్రభువుకు అధర్మకల్యాణం | 5 |
| శ్రీ హేమలంబ సంవత్సరంలో పండుగలపై ధర్మశాస్త్ర నిర్ణయములు | 7,8,9 |
| పంచాంగ భాగప్రారంభం, రాజాధి నవనాయకుల నిర్ణయాలు | 10 |
| కర్తరి, మౌఢ్యమి, పుష్కర నిర్ణయములు, మకరసంక్రమణం | 11 |
| ఆదాయ,వ్యయ,రాజ్యపూజ్యావమాన,కందాయ, కార్తెలు | 12 |
| శ్రీ హేమలంబలో పండుగలు, వ్రతాదులు, ముఖ్యదినాలు | 12 |
| సూర్య, చంద్రగ్రహణ విశేషాలు | 14 |
| శ్రీ హేమలంబలో పండుగ పర్వదిన విశేష పూజా సమయాలు | 16 |
| రాశిఫలితాలు చూసే వారికి ముఖ్య గమనిక | 17 |
| శ్రీ హేమలంబలో విశేష శుభయోగాలు - వివరణ | 18 |
| భారతదేశంలో సందిగ్ధ పితృతిథి నిర్ణయతేదీలు | 20 |
| నక్షత్రవారీగా గ్రహసంచార ప్రవేశ సమయాలు | 21 |
| శ్రీ హేమలంబ సంవత్సర ఫలితాలు | 26 |
| మాసవారీ గ్రహ విశ్లేషణలు | 28 |
| భారతదేశానికి శ్రీ హేమలంబ పంచాంగ భాగ ప్రారంభం | 29 |
| విజయవాడకు దేశాంతర సంస్కార పట్టిక, పండితులకు గమనికలు | 101 |
| భారతదేశానికి శ్రీ హేమలంబ సుముహూర్త భాగ ప్రారంభం | 102 |
| శ్రీ హేమలంబ సంవత్సర ద్వాదశ రాశుల ఫలితాలు | 113 |
| అంతర్జాతీయ పంచాంగభాగ ప్రారంభం | 125 |
| చివరి పేజీలలో విశేష వివరములు | 182-187 |

# గ్రహభూమి

## పంచాంగ విశిష్ఠత

సూర్యోదయ చంద్రోదయ, సూర్యాస్తమ చంద్రాస్తమ సమయాలతో, తిథి నక్షత్ర యోగ కరణ వర్జ్య దుర్ముహూర్త అమృతకాల సమయాలు, నిత్యం ఖచ్చిత రాహుకాల సమయం, అభిజిత్ సమయాలతోను, నక్షత్రపాదప్రవేశాలు, నిత్య గ్రహస్ఫుటాలు, లగ్నాంతకాలాలు, సందిగ్ధ పితృతిథి నిర్ణయాలు, పండుగలు వ్రతాదుల వివరములతో పాటు నిత్య గ్రహ సంచార రాశిచక్రము ఒకే పేజీలోనే పేర్కొన్న భారత ప్రభుత్వ సమ్మత దృక్సిద్ధాంత ఏకైక పంచాంగమే మా 'గ్రహభూమి'.

దృక్సిద్ధాంత అయనాంశలతో గణితము చేయబడిన ఈ గ్రహభూమి పంచాంగము నందలి గ్రహస్థితులు మరియు తిథి, నక్షత్ర, యోగ, కరణ, సమయములన్నియు శాస్త్రమునకు మరియు ప్రత్యక్షమునకు ఖచ్చితముగా సరిపోవును. రెండు తెలుగు రాష్ట్రములకు మధ్యనగల విజయవాడ (16.32 ఉత్తర అక్షాంశము 80.32 తూర్పురేఖాంశము) పట్టణమునకు ఈ పంచాంగము సంస్కారయుతమై గణించబడినది. దీనితోపాటు న్యూయార్క్, లాస్ఏంజిల్స్, లండన్ నగరములకు కూడా తిథి,నక్షత్ర, వర్జ్య, దుర్ముహూర్త, రాహుకాల వివరములు, శుభసమయాలు, పండుగ తేదీలు ఇవ్వడమైనది.

ఇందలి తిథి, నక్షత్ర, యోగ, కరణములకిచ్చినవి అంత్యసమయాలు, వర్జ్య దుర్ముహూర్త అమృతకాల, రాహుకాల, అభిజిత్ సమయాలకు ప్రారంభ, అంత్యములను, నిత్య నక్షత్రపాద ప్రవేశాలు, సందిగ్ధ రోజులలోని పితృతిథి నిర్ణయాలతో నిత్యం ఉదయం 5గం॥30ని॥లకు గ్రహస్ఫుటాలను తెలియజేయుటమైనది.

ముహూర్తాలలో పంచకరహితమైనవి, మతాంతరరహితమైనవి, శాస్త్రవచనాధారంగా గణించి ముహూర్తములను నిర్ణయించితిమి. ముహూర్త నిర్ణయాలలో శుభాంశ, వర్గోత్తమాంశ, పుష్కరాంశ సమయాలతోను, ప్రతి ముహూర్తానికి లగ్న ప్రారంభ అంత్య సమయాలనిచ్చిన ఏకైక పంచాంగమే మా 'గ్రహభూమి'.

ఎప్పటివలె మీ ఆదరాభిమానాలు మాపై ఉంచాలని కోరుకుంటూ,

మీ శ్రీనివాసగార్గేయ.....

కేంద్రప్రభుత్వ ఆమోద గణిత పంచాంగకర్త,
హైదాబ్రాద్.

## ప్రస్తుత సంవత్సరం పేరేమిటి?

ప్రభవాది 60 సంవత్సరాలలో ప్రతి సంవత్సరానికి ఓ పేరుంటుంది. పర్వదిన నిర్ణయ తేదీల సందిగ్ధం లాగే, 2017 మార్చిలో ప్రారంభమయ్యే తెలుగుసంవత్సర పేరు ఒక్కో పంచాంగంలో ఒక్కోరకంగా ఉంది. పాఠకులు అయోమయంలో ఉంటున్నారు. కొందరు హేవిళంబి, ఇంకొందరు హేవళంబి, మరికొందరు హేమలంబి, హేమలంబ,హేవళంబ ఇలా వివిధ రీతులలో నిర్ణయాలు జరుగుతున్నాయి. సంవత్సర నామ నిర్ణయంపై మా పూర్వీకులు ఇలానే చెప్పారండని సమర్థించుకునే పండితులూ ఉన్నారు.

ధర్మశాస్త్రాలు ఇచ్చిన నిర్ణయానుసారంగా 2017 మార్చిలో ప్రారంభ మయ్యే తెలుగు సంవత్సరం పేరు **'హేమలంబ'**. మరి వివరాలలోకి వెళ్లి సంవత్సర నామధేయమేమిటో తెలుసుకునే ప్రయత్నం చేద్దాం.

**నిర్ణయసింధు:** హేమలంబో విలంబోథ వికారీ శార్వరీ ప్లవః॥
**జ్యోతిర్విద్యాభరణం:** దుర్ముఖస్తదనుప్రోక్తో హేమలంబక సంజ్ఞకః॥
**శాంతికమలాకరం:** ఆదిత్యం తేజసాం స్థానం హేమలంబ కృతాహ్వయమ్ సప్త సప్తి సమారూఢం జగతాం నేత్రమాశ్రయే॥
**నారదసంహిత:** హేమలంబో నృపాస్సర్వే పరస్పర విరోధినః॥
**చతుర్వర్గ చింతామణి:** సప్తమీ హేమలంబాఖ్యో...॥
**బృహత్సంహిత:** హేమలంబ ఇతి సప్తమే యుగే స్యాత్॥
**వీరమిత్రోదయం:** విమోహినీ హేమలంబే పీతవర్ణా మృగాసనా॥
**పంచాంగపీఠిక:** ధరామరాగోకుల రాజబృందాధర్మ ప్రసక్తా ఖలు హేమలంబే। సీదంతి సర్వే విరలార్ఘ సస్యైరవృష్టిభిః, క్షుద్భయ పీడితాశ్చ॥
**అగ్నిపురాణం:** హేమలంబేన సంపదః॥

నిర్ణయసింధు, నారదసంహిత, దైవజ్ఞకర్ణామృతం, దైవజ్ఞ రంజనం, పంచాంగపీఠిక, అగ్నిపురాణం, జ్యోతిర్విద్యాభరణం, నారదసంహిత, చతుర్వర్గ చింతామణి, వీరమిత్రోదయం, శాంతికమలాకరం, సిద్ధాంత సరళి, భగవంత భాస్కర మున్నగు గ్రంధాలలో సంవత్సర నామము **'హేమలంబ'**గా నిర్ణయము జరిగి ఉన్నది.

2016 ఆగస్టు 8,9 తేదీలలో విజయవాడలో కంచి పీఠాధిపతుల సమక్షంలో దేశ నలుమూలల నుంచి వచ్చిన పంచాంగ కర్తల పండుగల నిర్ణయసభలో **'హేమలంబ'** సంవత్సరమే సరైనదని నిర్ణయం జరిగింది.

**కనుక ప్రస్తుత సంవత్సరం పేరు 'హేమలంబ'**

### సభలో ఒకలా, బయట మరోకలా ప్రవర్తించే పండితులు

శ్రీ కంచికామకోటి పీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ జయేంద్రసరస్వతి స్వామి వారి సమక్షంలో 2016 ఆగస్టు 9 విజయవాడలో జరిగిన పంచాంగ పండితుల సదస్సులో తమిళ తెలుగు రాష్ట్రాలకు చెందిన పూర్వపద్ధతి, దృక్పద్ధతి పంచాంగకర్తలు కొంతమంది పాల్గొన్నారు. వీరిలో తిరుమల దేవస్థానానికి ప్రస్తుత ఆస్థాన సిద్ధాంతిగా ఉన్నవారు కూడా పాల్గొన్నారు. ఈ సభలో జరిగిన నిర్ణయములన్నింటికీ సభకు విచ్చేసినటువంటి రెండు గణిత పంచాంగకర్తలు అందరూ ఆమోదం తెలిపారు.

కానీ సభ నుంచి బయటకు వచ్చిన తదుపరి కొంతమంది వారికిష్ట మైనట్లుగా పంచాంగాలు అచ్చు వేయించారు. సభా మర్యాద తెలియని వారు ఇట్టి సభలకెందుకు రావాలి? సభలో ఉగాది నిర్ణయతేదీ, సంవత్సర నామ నిర్ణయము, మహాశివరాత్రి నిర్ణయతేదీలతో పాటు ఇతర కొన్ని ముఖ్యదినములపై చర్చ జరిగినప్పుడు, సరైన ఆధారమివ్వ కుండా, సభలో చెప్పిన నిర్ణయాన్ని ఒప్పుకుని, బయటకొచ్చి , హేమలంబగా కాక వారి ఇష్టానురీతిగా హేమలంబి అని పంచాంగ ముద్రణకు గణితం ఇవ్వటం సభా మర్యాద కానేకాదు. సభలో జరిగిన ఆడియోలు కూడా భద్రపరిచి ఉన్నవి. ఇట్టి పంచాంగాలను చూసిన పాఠకులు అయో మయంలో పడతారు. కనుక హేమలంబి కానే కాదు.

## మార్చి 28నే శ్రీ హేమలంబ ఉగాది

శ్రీ దుర్ముఖి ఫాల్గుణ అమావాస్య తిథి దృగ్గణితరీత్యా 2017 మార్చి 28 మంగళవారం ఉ8గం॥26ని॥లతో వెళ్లును.తదుపరి శ్రీ హేమలంబ చైత్ర శు.పాడ్యమి ప్రారంభమై, 29 బుధవారం సూర్యోదయ పూర్వమే 5గం॥44ని॥లకు, పాడ్యమి తిథి వెళ్లును. ఈ నేపథ్యంలో శ్రీ హేమలంబ ఉగాది మార్చి 28 మంగళవారంగానే శాస్త్రీయమైన, ప్రామాణికమైన దృగ్గణిత పంచాంగ రీత్యా నిర్ణయించటం జరిగింది.

తిరుమల తిరుపతి (టి.టి.డి) వారి పూర్వగణిత పంచాంగంలో 2017 మార్చి 28 ఫాల్గుణ అమావాస్య ఉ8గం॥37ని॥లకు వెళ్లును. తదుపరి చైత్ర శు.పాడ్యమి ప్రారంభమై, 29 బుధవారం ఉ6.59ని॥లకు పాడ్యమి ముగియును. పూర్వగణిత పంచాంగాలలో ఉగాది నిర్ణయతేదీని మార్చి 29గా, తిరుమల తిరుపతి పంచాంగకర్త నిర్ణయించటం జరిగింది.

**శాస్త్రీయ ఉగాది ఎప్పుడు?** అసలు పూర్వగణితమే శాస్త్రీయం కాదు. మరి శాస్త్రీయం కానటువంటి పంచాంగంలో నిర్ణయించిన ఉగాది తేదీ అసలు పరిగణనలోనికి రాదు. కానీ ఈ పంచాంగాలను ఇప్పటికీ కొంతమంది వినియోగిస్తున్నారు. తిరుమల తిరుపతి దేవస్థానం వారు తెలియకనే పూర్వగణిత పంచాంగాన్ని ముద్రిస్తున్నారు. అందుచేతనే సరైన నిర్ణయాలను ఇవ్వాలనేదే ఈ శీర్షిక సారాంశం.

1. గతంలో 1903 మార్చి 29 ఆదివారంగా శ్రీ శోభకృత్ సంవత్సర ఉగాదిని దృక్ సిద్ధాంతము వారు, మార్చి 30 సోమవారంగా పూర్వగణితం వారు నిర్ణయించారు. కానీ పూర్వగణితం వారికి 30వతేదీన తిథి 3 ముహూర్తాలు సమయం లేనందున, ఆనాడు జగద్గురువులు పూర్వగణితం వారికి 2వరోజున సూర్యోదయం తదుపరి ముహూర్తత్రయ వ్యాపిని లేనందున (అనగా 2గం॥24ని॥లు అని అర్థము) ధర్మశాస్త్రరీత్యా సూర్యోదయం తరువాత మూడు ముహూర్తాల కాలము అనగా 144నిముషాల వరకు పాడ్యమి తిథి ఉన్నరోజునే ఉగాదిని నిర్ణయించాలి. ఆనాడు వారికి లేనందున ముందురోజుకు మార్చుకున్నారు.

2. అదేవిధంగా శ్రీ సర్వజిత్ సంవత్సరంలో (2007) దృగ్గణిత పంచాంగ ప్రకారంగా 19 మార్చి 2007 ఉగాదిగా నిర్ణయిస్తే, తిరుమల తిరుపతి వారు పూర్వగణిత రీత్యా 20 మార్చి ఉగాదిగా ముద్రించారు.

ఈ సందర్భంగా తే.7.3.2007ది పూర్వగణితం తరపున ఆనాటి టి.టి.డి పంచాంగకర్తలైన శ్రీ తంగిరాల ప్రభాకర పూర్ణయ్య గారు (ప్రస్తుతం వీరు కీర్తిశేషులైనారు), దృగ్గణితం తరపున శ్రీనివాసగార్గేయ అనబడే నేను మరియు మా దృగ్గణిత పంచాంగ మిత్రులందరూ కలసి ఆనాటి ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వ దేవాదాయ ధర్మాదాయ శాఖ కమీషనర్ గారైన శ్రీ సుందరకుమార్ ఐ.ఎ.యస్ గారి ముందు చర్చలలో పాల్గొన్నాము. ఈ చర్చలలో మాతోపాటు శ్రీ ఐ.వి.సుబ్బారావు ఐ.ఎ.యస్, శ్రీ కె.వి. రమణాచారి ఐ.ఎ.యస్, శ్రీ పి.వి.ఆర్.కె.ప్రసాద్ ఐ.ఎ.యస్ గార్లందరూ చర్చలలో ఉన్నారు.

ఈ చర్చలలో కూడా రెండవరోజున 3 ముహూర్తాలు లేదా 6 ఘడియలు లేదా 144నిముషాలపాటు సూర్యోదయం తదుపరి పాడ్యమి తిథి కొనసాగలేదు. 3 ముహూర్తాల కంటే ఎక్కువుంటే 2వరోజు, తక్కువ ఉంటే ముందురోజుగా ఉగాది నిర్ణయం జరగాలి. అంచేత శాస్త్రీయ దృగ్గణిత ప్రకారంగానే తే19.3.2007ది శ్రీ సర్వజిత్ ఉగాది పండుగను ఆనాటి ప్రభుత్వం ప్రకటించారు.

ప్రభుత్వం వారు మార్చి 20న కాక 19వ తేదీగానే ఉగాదిని ప్రకటించినందున ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ దేవాదాయ, ధర్మాదాయ శాఖ వారి రికార్డు లలో మార్చి 19వతేదీని ఉగాదిగా ఒప్పుకుంటూ ఇరుగణితాల వారి తరపున నేను, శ్రీ తంగిరాల ప్రభాకర పూర్ణయ్య గారు సంతకాలు పెట్టటం జరిగింది. ఈ విషయం ప్రస్తుత తెలుగు రాష్ట్రాలలో ఉన్న పండితులందరికీ విదితమే.

3. ప్రస్తుత హేమలంబిలో కూడా టి.టి.డి వారి పూర్వగణితం పంచాంగంలో మరునాటి సూర్యోదయం తదుపరి పాడ్యమి తిథి కేవలం 58 నిముషాలు మాత్రమే ఉన్నది. కానీ ఉండవలసినది 144 నిముషాలు. ఇప్పుడు ఉగాది ఏనాడో మీకే అర్థమైనది.

4. కర్ణాటకలోని శృంగేరీ పట్టణానికి మార్చి 29 సూర్యోదయం ఉ6.28 ని॥లు. మరి పూర్వగణిత ప్రకారంగా శృంగేరికి పాడ్యమి తిథి కేవలం 31ని॥లు మాత్రమే ఉన్నది. కనుక వారికి కూడా 28నే .

5. **శ్రీ కంచి పీఠాధిపతి సమక్షంలో 9.8.2016న విజయవాడలో పంచాంగ పండిత సదస్సుకు దేశవ్యాప్తంగా వచ్చిన పూర్వ, దృక్పద్ధతి పంచాంగకర్తలతో పాటు తిరుమల దేవస్థాన సిద్ధాంతి గారు కూడా పాల్గొన్నారు. పండిత సభలో ఉగాది 2017 మార్చి 28గా నిర్ణయించారు. ఈ నిర్ణయమునకు టి.టి.డి సిద్ధాంతి గారు ఆమోదం తెలిపారు.**

6. **సభలో తిరుమల సిద్ధాంతి గారిని గ్రహణ గణితమడిగితే, తమ పద్ధతి ప్రకారం చేస్తే ఎలా వస్తుందో తెలియదండి, అందుకే కంప్యూటర్ సాఫ్ట్‌వేర్ నుండి డౌన్‌లోడ్ చేసి తెచ్చామని చెప్పారు. సభ ప్రారంభం నుండి అంత్యం వరకు జరిగిన సంభాషణ పూర్తిగా రికార్డు చేయటం జరిగినది.** సభలో తిరుమల సిద్ధాంతి గారు ఒప్పుకుని, బయటకు వచ్చిన తదుపరి మార్చి 29 ఉగాదిగా, మహాశివరాత్రిని సభలో 2018 ఫిబ్రవరి 14గా ఒప్పుకుని తద్విరుద్ధంగా ఫిబ్రవరి 13గా ముద్రణ చేయించారు.

7. తిథి నక్షత్ర సమయాలు సరికావని పూర్వగణిత పంచాంగ కర్తలందరికీ ఆత్మసాక్షిగా తెలుసు. కానీ ఇన్ని సంవత్సరాలపాటు తప్పు సమయాలతో పంచాంగాలను ముద్రించి, ఇప్పుడు దృగ్గణిత పంచాంగం అందిస్తే, ప్రజలు పూర్వగణితం పంచాంగకర్తలను దూషిస్తారేమోనని భయం నిండా ఉంది. ఇప్పటికైనా తెలుసుకొని ఖచ్చిత దృగ్గణితాన్ని అందిస్తే మంచిదని ప్రజలందరూ అభిలషిస్తున్నారు.

## ఉగాది పర్వదినంపై ధర్మశాస్త్ర నిర్ణయాలు

శ్లో॥ దిన ద్వయే తద్వ్యాప్తౌ వవ్యాప్తౌవా పూర్వైవ॥
చైత్రేసిద ప్రతిపది యోవారోర్కోదయే సవర్షేశః।
ఉదయ ద్వితయే పూర్వోనోదయ యుగళే పి పూర్వస్యాత్।
యస్మాచ్చైత్ర సితాదేరుదయాద్భానోః ప్రవృత్తిరబ్దాదేరతి॥

శ్లో॥ శుక్ల ప్రతిపత్ పూర్వవిద్ధా గ్రాహ్యా ప్రతిపద్య
మావాస్యేతి యుగ్మవాక్యాత్॥

శ్లో॥ దినద్వయే ఉదయ వ్యాప్తావవ్యాప్తౌవా పూర్వైవ ॥
యదా పూర్వేద్యురుదయ కాలం.......**త్రిమూర్తవ్యాప్తిర్దినద్వయేప్యభావేచ**
ద్వయోరపి గౌణకాలత్వేసతి ..... గ్రహణ న్యాయతః ॥
ఆదిత్యోదయ వేళాయాం అల్పాపిచ తిథిర్భవేత్ ।
పూర్ణా ఇత్యేవమంతవ్యా ప్రభూతానోదయం దినేతి ।
తదా పూర్వేద్యుస్సంగవమారభ్య పరేద్యురుద
యాత్ప్రాగేవ తిథిక్షయవశాత్ప్రతిపత్సమాప్తౌ
**తదా యద్యపి దినద్వయేపి ఉదయ ముహూర్త త్రయస్య**
**స్పర్శోనాస్తి తదా పూర్వేద్యురేవానుష్ఠేయం॥**

ధర్మసింధు, నిర్ణయసింధు, జ్యోతిర్నిబంధం, కాలనిర్ణయచంద్రిక, వృద్ధ వసిష్ఠ, భగవంత భాస్కర, సమయ మయూఖ, కాలమాధవీయ మను ధర్మశాస్త్రాలను పరిశీలిసే.. సూర్యోదయ, అస్తమయము ఒకే తిథిలో జరిగినచో దానిని పూర్ణతిథి అంటారు. లేనిచో ఖండతిథి అగును.

దృగ్గణితంలో రెండు రోజులలో పాడ్యమికి సూర్యోదయస్పర్శ లేదు. ఈ స్థితిలో సూర్యాస్తమయంలో పాడ్యమి తిథి ఏరోజు నుండునో ఆరోజును సాకల్యముగా స్వీకరించాలి. అప్పుడు **మార్చి 28నే ఉగాది.** ఇక పూర్వగణితాన్ని పరిశీలిస్తే 2వరోజు సూర్యోదయంలో తిథి 3 ముహూర్తాల వ్యాప్తి లేనే లేదు. అప్పుడు వారికి కూడా **మార్చి 28నే .** **రెండు గణితాలను ధర్మశాస్త్రాలకు అన్వయించుకుంటే ఉగాది 28నే.**

## ధర్మప్రభువుకు అధర్మ కల్యాణం

శ్రీరామజననానికి పరమప్రామాణికమైనది వాల్మీకి మహర్షి రచించిన శ్రీ రామాయణంలోని దిగువ శ్లోకాన్ని ఓసారి గమనించండి.

"తతశ్చ ద్వాదశమాసే చైత్రే నావమికే తిథౌ
నక్షత్ర దితి దైవత్యే స్వోచ్చ సంస్థేషు పంచసు
గ్రహేషు కర్కటే లగ్నే వాక్పతా విందునా సహ
ప్రోద్యమానే జగన్నాథం సర్వలోక నమస్కృతమ్
కౌసల్యా జన యద్రామం సర్వలక్షణ సంయుతమ్"

**- వాల్మీకి రామాయణం**

తాత్పర్యం: శ్రీరాముడు చైత్రశుక్ల నవమి పునర్వసు నక్షత్ర కర్కాటక లగ్నంలో మధ్యాహ్న సమయమందు,5 గ్రహాలు ఉచ్ఛస్థితిలో ఉండగా, మేషమాసంలో గురుచంద్రులు కలిసిన సమయంలో జన్మించెను. ఈ శ్లోకానుసారం శ్రీరామచంద్రుడు నవమి తిథి ఉన్నప్పుడు పునర్వసు నక్షత్రం మధ్యాహ్నంలో జన్మించెనని స్పష్టంగా చెప్పబడినది.

పంచాంగ ధర్మ శాస్త్ర నియమాల ప్రకారం తిథులను బట్టి, వాటి వ్యాప్తి నిర్ణయాలను బట్టి పండుగలను నిర్ణయమగును. ఒక్కోసారి నవమి తిథి ఉన్నరోజే పునర్వసు నక్షత్రం కలిసి వస్తుంటుంది. నక్షత్రం కలిసి వచ్చినా రాకున్నా తిథి వ్యాప్తిని బట్టే పండుగ నిర్ధారణ జరుగును.

భద్రాచల దేవస్థాన చరిత్రలోనే మొదటిసారిగా వ్యతిరేక ధోరణితో 26 మార్చి 1999న, 2వసారి 13.4.2000న, 3వసారి 4.4.2009న ధర్మశాస్త్ర నిర్ణయాలకు వ్యతిరేకంగా శ్రీరామచంద్రునికి అధర్మంగా కల్యాణాలు జరిగాయి. భద్రాచల చరిత్రకు భవిష్యకాలంలో మచ్చరాకుండా ఉండాలనే ఉద్దేశ్యంతోనే ఈ వ్యాసాన్ని మీ ముందుంచుతున్నాను.

ఆగమశాస్త్రములన్నియు హిందూ ధర్మశాస్త్రం లోనివే. ఆగమ శాస్త్రోక్తంగానే హిందూ దేవాలయాలలో అర్చనలు జరుగుట అందరికీ తెలిసిన విషయమే. ఈ నేపథ్యంలో భద్రాచలంలో వైష్ణవ సంప్రదాయ పాంచరాత్రాగమ ప్రకారంగా నిత్యోత్సవ, వారోత్సవ, పక్షోత్సవ, మాసోత్సవ, సంవత్సరోత్సవములు జరుపబడుచున్నవి.

**అధర్మంగా కల్యాణాలు జరపటమంటే?..**

శ్రీరామనవమికి నవమి తిథి మధ్యాహ్న సమయానికి ఉన్నప్పుడు భద్రాచలంలో శ్రీరామకల్యాణం చేసేవారు. ఇది అనూచానంగా వస్తున్నది. ఉన్నపళంగా 1999 నుంచి వారి నిర్ణయాలకి తిలోదకాలు ఇచ్చారు. ఇక ఆ వివరాలు అంచలంచలుగా తెలుసుకుందాం.

భద్రాద్రి పాంచరాత్రాగమ దేవస్థానం. అష్టమి తిథి కలిసిన నవమి రోజున శ్రీరామకల్యాణం చేయకూడదని, సూర్యోదయం నుంచే నవమి ఉంటేనే శ్రీరామకల్యాణం చేయాలని, ఇది వారి ఆగమశాస్త్ర ప్రకారం నియమమని 1999 నుంచి సరిక్రొత్త నిర్ణయాన్ని తెరపైకి తెచ్చారు.

1999లో పూర్వగణితం, దృగ్గణితం ప్రకారం ఒకేరోజు శ్రీరామ నవమి ఉన్నప్పటికీ, ఈ రెండు గణితాలని విబేధించి పాంచరాత్ర ఆగమ సిద్ధాంత స్వాములు, పండితులు ఎవరి నిర్ణయాలను లెక్క చేయక సరిక్రొత్త ప్రతిపాదనలు తీసుకొచ్చారు.

పాంచరాత్ర ఆగమ గ్రంథాలలో ఎక్కడా పై అంశాన్ని చెప్పలేదు. ఇంతకీ వారి ఆగమాలలో ఏమి చెప్పబడింది? పాంచరాత్ర ఆగమాల ప్రకారం శ్రీరామజయంతి నిర్ణయానికి అష్టమివిద్ధతో కూడిన నవమి తిథి కూడదని, వారి గ్రంథమైన పరమ పురుషసంహితలో ఉన్నది. శ్రీరామకల్యాణానికి అష్టమి విద్ధ తప్పుకాదని, వారి 2వ ఆగమ గ్రంథమైన పురుషోత్తమ సంహితలో అతిస్పష్టంగా చెప్పబడింది.

**శ్రీరామజయంతి నిర్ణయ ఆగమ గ్రంథం పరమపురుష సంహిత**
**శ్రీరామకల్యాణ నిర్ణయ ఆగమ గ్రంథం పురుషోత్తమ సంహిత**

**శ్రీ పాంచరాత్ర ఆగమం పరమపురుష సంహితలో 9వ అధ్యాయంలో శ్రీరామజయంతి నిర్ణయం**

శ్లో॥ చైత్రమాసే సితే పక్షే నవమ్యాంచ పునర్వసౌ
మేష సంక్రమ యుక్తాయాం మధ్యాహ్నే కర్కటేతథా
రామచంద్రో హరిస్సాక్షాదావిరాసీ జ్జగత్పతిః
మేష స్సంక్రమణోపేతామయుతా మపి భూసురాః
చైత్ర శుక్లాష్టమీ విద్ధా రహితాం కలయాపిచః
పరవేధాయుతాం వాపి నవమీ దివసంపురా
వినిశ్చిత్యతు తస్మిన్వై సీతారామం జగత్పతిం
**విశేషోత్సవ సుస్నాన, పూజా, భోగాదికైశ్శుభైః**
లోక కల్యాణ హేత్వర్థం ప్రత్యబ్దం పరితోషయేత్.
యదాతు పూర్వదివసే నవమీ దూషితం భవేత్
పరస్మిత్ కలామాత్రం నవమీ యదినాస్తిచేత్
కేవలం దశమీమేవ **ఉత్సవార్థం** ప్రకల్పయేత్
దశమీ యది వృద్ధిశ్చేత్ త్యాజ్యావిష్ణు పరాయణైః

ఇచట అష్టమీ విద్ధతో కూడిన నవమి దూషితము గాన, దూషిత నవమి పనికిరాదు (ఇది అష్టమీ విద్ధ). కలా మాత్రం లేకపోయినను పరదినమునే దశమి అయినా తప్పక చేయాలి. **విద్ధ పనికిరాదు, దశమి అయినా ఆచరించాలి అనునది కేవలం శ్రీరామజయంతి విషయం గూర్చి మాత్రమే. అనగా శ్రీరామకల్యాణ ఆచరణ విషయంలో అష్టమి విద్ధను గురించి చెప్పబడలేదు.**

**శ్రీ పాంచరాత్ర ఆగమం పురుషోత్తమ సంహిత 24వ అధ్యాయంలో కల్యాణోత్సవ దివస నిర్ణయం**

శ్లో॥ యస్యావతారదివసే తస్యకల్యాణ మాచరేత్
అవతారేషు సర్వేషు అనుక్తే జన్మతారకే
చైకాదశ్యాం ప్రకుర్వీత కల్యాణం భక్తి భావతః
జగత్కల్యాణ సిద్ధ్యర్థం ప్రత్యబ్దం కారయేత్సవమ్
విష్వక్సేనం ప్రపూజ్యాదౌ పుణ్యాహస్యజ లేనతు
సంప్రోక్ష్య సర్వసంభారాన్ రక్షా సూత్రాణిధారయేత్
ధృవాది మూలబింబానాం శ్రియాదీనాం తథైవచ
ఆచార్యాణాం సర్వేషాం ఋత్విజాంశ్చయధావిధి
విష్వక్సేనం ప్రపూజ్యాథ పుణ్యాహం వాచయేత్తతః
విజ్ఞాప్య పాణి గ్రహణ కర్మ దేవాయ భక్తితః
కదా చిన్నపరిత్యాద్యం వర్షేవర్షేతు నిశ్చితం
నిత్యోత్సవ విహీనేతు ప్రాయశ్చిత్తం విధీయతే
అక్షతారోహణం నామహ్యుత్సవం ప్రతివార్షికం
భక్తి శ్రద్ధాన్వితో దేవం పాణి గ్రహణమాచరేత్
పాణిగ్రహణ విధ్యుక్తం కర్మసర్వం సమాచరేత్ ॥ఇతి॥

కల్యాణనిర్ణయంలో అష్టమితో కూడిన నవమి (విద్ధ)చెప్పలేదు. అష్టమితో కూడిన నవమి (విద్ధ) కేవలం జయంతికి మాత్రమే. కల్యాణానికి విద్ధ అడ్డం కానేకాదు. ఇచట ఎవరి అవతార దివసములో వారి కల్యాణం చేయాలి. లేదా ఏకాదశి నాడైననూ ఆచరించవచ్చును. ఇది పాంచరాత్రం వారి ఆగమ సారాంశం.

1999కి ముందు పలుసార్లు అష్టమితో కూడిన నవమి రోజులలో శ్రీరామకల్యాణం ఆచరించారు. ఇలా ఆచరించుమని చెప్పిన మహనీయులు స్వాములు, పండితులు జ్ఞానులే కదా!...ఇట్టి జ్ఞానులు అష్టమి కలిసిన నవమి తిథైనా తప్పుకాదని కల్యాణాలు భద్రాద్రిలో జరిపించారు.

1999 తదుపరి అష్టమితో కూడిన నవమి పనికిరాదని, కేవలం నవమి తిథి మాత్రముంటే కల్యాణం జరిపించాలి అన్నారు. మరి ఈ నిర్ణయం చెప్పినవారు జ్ఞానులైతే, 1999కి ముందు నిర్ణయాలు చెప్పినవారు అజ్ఞానులే కదా.

**పాంచరాత్ర ఆగమ గ్రంథాలలో చెప్పినట్లు కల్యాణ నిర్ణయానికి ఋజువులు ఉన్నాయా ? 1999కి ముందు అష్టమివిద్ధ ఉన్న నవమి రోజులలో కల్యాణాలు జరిగాయని చెప్పటానికి ఋజువులు ఉన్నాయా ?.. ఎందుకు లేవు.. మీరే చూడండి.**

భద్రాచలంలో భక్తరామదాసు కాలం నుంచి పాంచరాత్రాగమ ప్రకారంగా అర్చనలు జరుగుచున్నవి. 1940 నుంచి 2000 వరకు 60 సంవత్సరాల కాలంలో భద్రాద్రి రామాలయ కల్యాణచరిత్రను పరిశీలిస్తే అతిముఖ్య విషయాలు తెలుస్తాయి. ఏమిటంటే పాంచరాత్ర ఆగమసిద్ధాంత గ్రంథాలలో ఏమి చెప్పబడినవో, చెప్పిన రీతిలోనే ఈ 60 సంవత్సరాలలో భద్రాద్రిలో కల్యాణాలు జరిగాయి అని చెప్పటానికి ఆనాటి కల్యాణతేదీలే ప్రత్యక్ష నిదర్శనములు.

**1. ప్రమోద** - 3 ఏప్రిల్ 1990 మంగళవారం అష్టమి ఉ8.25 వరకు ఉన్నది. తదుపరి నవమి తిథి ప్రవేశం.

**2. దుర్మతి** - 12 ఏప్రిల్ 1981 ఆదివారం అష్టమి ఉ9.23 వరకు ఉన్నది. తదుపరి నవమి తిథి ప్రవేశం

**3. సిద్ధార్థి** - 5 ఏప్రిల్ 1979 గురువారం అష్టమి ఉ6.12 వరకు ఉన్నది. తదుపరి నవమి ప్రవేశం.

**4. కాలయుక్తి** - 16 ఏప్రిల్ 1978 ఆదివారం అష్టమి ఉ6.20 వరకు ఉన్నది. తదుపరి నవమి తిథి ప్రవేశం

**5. నల** -8 ఏప్రిల్ 1976 గురువారం అష్టమి ఉ6.54 వరకు ఉన్నది. తదుపరి నవమి తిథి ప్రవేశం

**6. ప్లవంగ** - 18 ఏప్రిల్ 1967 మంగళవారం అష్టమి ఉ8.42 వరకు ఉన్నది. తదుపరి నవమి తిథి ప్రవేశం

**7. పరాభవ** - 30 మార్చి 1966 బుధవారం అష్టమి ఉ9.17 వరకు తదుపరి నవమి ప్రవేశం

**8. హేవళంబి** - 8 ఏప్రిల్ 1957 సోమవారం అష్టమి ఉ9.56 వరకు తదుపరి నవమి తిథి ప్రవేశం

**9. విజయ** - 24 మార్చి 1953 సోమవారం అష్టమి ఉ6.25 వరకు ఉన్నది. తదుపరి నవమి ప్రవేశం

ఈ 60 సంవత్సరాలలో 9సార్లు అష్టమి తిథితో కూడిన నవమి రోజునే శ్రీరామకల్యాణాలు జరిగాయి. దానికి ముందు కూడా అష్టమి విద్ధ ఉన్న రోజులలోనే కల్యాణాలు చేశారు. 1998వ సంవత్సరం వరకు నిరాటంకంగా అష్టమి విద్ధ గల నవమి రోజులలో కూడా ఎలాంటి వివాదం లేకుండా రామకల్యాణం జరుగుతూనే ఉంది.

**1999వ సంవత్సరంలో మొదటిసారిగా పురుషోత్తమ సంహిత ప్రమాణవాక్యమునకు సంవత్సర విధికి భంగము కావిస్తూ అష్టమి విద్ధ ఉన్న తిథిని దూష్యముగా భావిస్తూ, సరిక్రొత్త వివాదమునకు భద్రాచలంలో అంకురారోపణ చేయటం జరిగింది.**

**శ్రీ ప్రమాధి సంవత్సరంలో 25 మార్చి 1999 గురువారానికి బదులు 26 మార్చి 1999 శుక్రవారం పునర్వసు దశమితిథిలో శ్రీరామచంద్రునకు ఆనాటి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ అధికార తాకీదుతో కల్యాణం జరిగింది. ఇదే ధర్మప్రభువుకు జరిగిన అధర్మకల్యాణం.**

విజ్ఞులైన పాఠకులు, భక్తులలు ఆలోచించాల్సిన అంశాలున్నాయి.

1. భద్రాచల దేవస్థానం పాంచరాత్రాగమ సిద్ధాంత ప్రకారమే జరిగేట్లయితే అష్టమితో కూడిన నవమి కల్యాణానికి దూషితమని వారి ఆగమ గ్రంథంలో చెప్పబడలేదు.

2. పాంచరాత్ర ఆగమ ప్రకారం శ్రీరామజయంతి నిర్ణయానికి మాత్రమే అష్టమితో కూడిన నవమి పనికిరాదు అని పరమపురుష సంహితలో స్పష్టంగా ఉన్నది. కల్యాణానికి మాత్రం అష్టమితో కూడిన నవమి తప్పుకాదని పురుషోత్తమ సంహితలో అతిస్పష్టంగా చెప్పబడినది.

3. మరి 1998 వరకు అనేక పర్యాయాలు అష్టమి తిథితో కూడిన నవమి రోజులలో శ్రీరామ కల్యాణాలను ఎందుకు ఆచరించారు? ఈ విషయంపై పాంచరాత్ర ఆగమపండితులు నోరు మెదపరు.

4. భద్రాద్రిలో ఇలా తప్పుగా కల్యాణాలు జరుగుతున్నాయని పూర్వగణిత, దృగ్గణిత పంచాంగకర్తలందరూ ప్రభుత్వంపై వత్తిడి చేయగా, ప్రభుత్వం వారు శ్రీరంగ దేవస్థాన ప్రధాన అర్చకులను (శ్రీరంగ అర్చకులు కూడా పాంచరాత్రులే) సలహా కోరటంతో వారు స్పందించి అష్టమి కలిసిన నవమి రోజున శ్రీరామనవమిని చేయవచ్చునని, శ్రీరంగ దేవస్థాన లెటర్‌హెడ్‌పై ఉత్తర రూపంలో ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వానికి తెల్పిననూ ప్రయోజనం శూన్యం.

5. 1999కి ముందు 50 సంవత్సరాలుగా భద్రాద్రిలో భక్తులకు విసనకర్రలు, మజ్జిగ ఉచితంగా సరఫరా చేసే భక్తుడైన శ్రీ కందుల లక్ష్మణరావు గారు, వారికున్న 50 సంవత్సరాల గతానుభవంతో శ్రీ విక్రమ సంవత్సరంలో తే12 ఏప్రిల్ 2000దిన శ్రీరామకల్యాణమని (అష్టమి కలిసిన నవమి తిథిన) వేలాది కరపత్రాలు అచ్చు వేయించారు. ఇదొక విశేషమైన తిరుగులేని సాక్ష్యము.

6. నాస్తికవాదం ప్రబలుతున్న తరుణంలో కొంతమంది అనాలోచిత, అసంఘటిత నిర్ణయాలచే ప్రజలలో భక్తిభావం సన్నగిల్లి, నాస్తికత పెరిగే అవకాశం ఉంది. తరతరాలుగా వస్తున్న శాస్త్రీయ సిద్ధాంత నిర్ణయాలను కాలదన్ని నూతన భావాలను ప్రజలపై రుద్దటమనేది ధర్మశాస్త్రాలకు వక్రభాష్యం చెబుతూ అపహాస్యం చేయటమే.

7. ఈ నేపథ్యంలో 2017 ఏప్రిల్ 4 మంగళవారం అష్టమితో కూడిన నవమి తిథి ఉన్నది. ఏప్రిల్ 5 బుధవారం నాడు సూర్యోదయం నుంచే నవమి తిథి పుష్యమితోనున్నది. కనుక పాంచరాత్ర ఆగమ గ్రంథాలు చెప్పినప్పటికీ కల్యాణం భద్రాద్రిలో ఏప్రిల్ 4 చేయనే చేయరు.

**4 ఏప్రిల్ 2017 శ్రీరామనవమి**
**5 ఏప్రిల్ 2017 వైష్ణవ శ్రీరామజయంతి**

## సామవేద ఉపాకర్మ నిర్ణయము

**ఉపాకర్మ న కుర్వీత క్రమాత్ సామర్గ్యజుర్విదః।**
**గ్రహసంక్రాన్తియుక్తేషు హస్తశ్రవణపర్వసు॥ - స్మృత్యంతరము**
**శ్రావణ్యాం ప్రోష్ఠపద్యాం వాప్యుపాకృత్య యథావిధి। - మనువు**

పూర్ణిమ మరియు శ్రవణా నక్షత్రము దూషితములైనందున, ఆనాడు జరగవలసిన ఉపాకర్మను భాద్రపదంలో ఆచరించాలి. సామవేదులు ఉపాకర్మను శ్రావణమాస హస్త నక్షత్రంలో వాస్తవంగా ఆచరించాలి. కానీ చంద్రగ్రహణం వచ్చినందున శ్రావణమాసమంతా దూషితమైనది. కాబట్టి భాద్రపదమాసంలో వచ్చే హస్త నక్షత్రం రోజున **అనగా 25 ఆగస్టు 2017 భాద్రపద శుక్ల చవితి హస్త నక్షత్రం రోజున సామవేదులు ఉపాకర్మను ఆచరించాలని శాస్త్రనిర్ణయములు.**

### ప్రాంతీయాచారాలతో ఉపాకర్మ నిర్ణయాలు

పాఠకులకు ఓ సందేహం రావచ్చు. గ్రహణంచే పూర్ణిమ, శ్రవణాలతో పాటు శ్రావణమాసమే దూషితమైనదని, సామవేదులు భాద్రపదంలో ఆచరిస్తారు. మరి ఋగ్వేదులకు మాత్రం దూషితము కాదా? ఈ వాదన ఉత్తర భారతంలో ఉన్నది. గ్రహణం శ్రవణంలో పట్టింది.ఆ నక్షత్రం వరకే దూషితంగా భావించి ఋగ్వేదులు శుక్ల పంచమికి ఆచరిస్తారు. అలాగే సామవేదులు కూడా శ్రావణ శుక్ల పంచమికే ఆచరించే వర్గం కూడా ఉన్నది. గురు,శుక్ర మౌఢ్య దోషాలతో ఉన్నప్పుడు భాద్రపదం ఆచరిస్తారు. భాద్రపదం దోషం ఉంటే ఆషాఢంలో ఆచరిస్తారు. అసలు ఆషాఢమే దోషమైతే చివరికి శ్రావణమాసం తప్పదు. మొత్తం మీద ఉత్తర భారతంలో పలు ప్రాంతీయ ఆచారాలున్నవి.

## ఉపాకర్మ నిర్ణయములు

ప్రతి సంవత్సరం ఉపాకర్మలాచరించు వారు మరియు నూతనంగా ఉపనయనమైన వారు, ప్రతి శ్రావణమాసంలో ఉపాకర్మలను తిథి, నక్షత్రాల ప్రకారంగా ఆచరించాలని ధర్మశాస్త్ర నిర్ణయం. ఈ నేపథ్యంలో యజుర్వేదులు శ్రావణ పూర్ణిమన, ఋగ్వేదులు శ్రవణా నక్షత్రంలోను, సామవేదులు హస్త నక్షత్రంలోను ఉపాకర్మలాచరించాలి.

గురుమౌఢ్యమి, శుక్రమౌఢ్యమి, గ్రహణములు, అధిక మలమాసములు మరియు సింహగురు దోషములు గనుక శ్రావణమాసంలో ఉన్నచో ఉపాకర్మలు నిషిద్ధము. గ్రహణం కాకుండా మిగిలిన దోషములైనచో నూతన వటువులకు మాత్రమే నిషేధము. గ్రహణము ఉన్నటువంటి మాసమైనచో నూతన వటువులే కాక ప్రతి వర్షము ఆచరించే వారికి కూడా నిషేధమే. ధర్మశాస్త్రములు చెప్పినవి.

శ్రీ హేమలంబ శ్రావణ పూర్ణిమకు 7 ఆగస్టు 2017 సోమవారం మకరరాశిలో శ్రవణా నక్షత్రంలోనే చంద్రగ్రహణం సంభవిస్తున్నది. ఇది భారతదేశంలో కనపడును. కనుక నూతన వటువులతో పాటు వార్షిక ఉపాకర్మలు ఆచరించే వారు కూడా భాద్రపదమాసంలో ఆచరించాలి.

శ్రావణం దోషమైతే భాద్రపదంలోను, శ్రావణ భాద్రపదాలు రెండూనూ దోషాలైతే ఆషాఢంలోను ప్రథమ ఉపాకర్మలను ఆచరించాలి. ఋగ్వేదులకు శ్రవణా నక్షత్ర ప్రాధాన్యం. శ్రవణం చంద్రగ్రహణ దూషితమైనందున ఋగ్వేదులకు భాద్రపదం కాకుండా శ్రావణ శుక్ల పంచమి హస్తా నక్షత్రం రోజున ఉపాకర్మలాచరించాలని స్మృతి మహార్ణవము మరియు గార్గ్య మహర్షి వచనములు.

కేవలం చంద్రగ్రహణము, సంక్రమణములు వచ్చినప్పుడే హస్త నక్షత్రంతో కూడిన శ్రావణ శుక్ల పంచమిన ఆచరించాలి. గురు,శుక్ర మౌఢ్యాలు అధిక మలమాసాలు, సింహగురుదోషం వంటివి వచ్చినచో భాద్రపదంలోనే చేయాలని శాస్త్ర నిర్దేశములు.

మొత్తం మీద చంద్రగ్రహణమున్నందున ఉపాకర్మలు ఏయే తేదీలలో ఆచరించాలి అనే వివరాన్ని రెండు ముక్కలలో తెలియజేయవచ్చు. కానీ మా పాఠకులకు సంపూర్ణమైన విషయాన్ని అందించాలనే ఉద్దేశ్యంతోనే ఈ ఉపాకర్మలు గురించి సవివరంగా విషయాలను ముందు తెలియజేసి, తదుపరి శ్లోకాలను, తాత్పర్యాలను అందిస్తున్నాను. కనుక విజ్ఞులైన పండితులు గమనించేది.

## ఋగ్వేద ఉపాకర్మ నిర్ణయము

**సంక్రాన్తిర్గ్రహణం వాహి పౌర్ణమాస్యాం యదా భవేత్।**
**తన్మాసి హస్తయుక్తాయాం పఞ్చమ్యాం వా తదిష్యతే॥-స్మృతిమహార్ణవము**
**యది పూర్ణిమా సంక్రాన్తిగ్రహణాదిదోషవిశిష్టా తథా**
**తన్మాసి హస్తయుక్తపఞ్చమ్యాం కార్యమిత్యుక్తమ్॥ - గార్గ్య మహర్షి**

**తా॥ స్మృతిమహార్ణవము మరియు గార్గ్యవచనానుసారంగా గ్రహణంచే శ్రవణము దూషితమైనందున, శ్రావణంలోని శుక్ల పంచమీ యుక్త హస్తలో ఉపాకర్మను ఆచరించవలయును. కనుక 28 జూలై 2017 శుక్రవారం ఋగ్వేదీయులు ఉపాకర్మను ఆచరించవలయును.**

## యజుర్వేద ఉపాకర్మ నిర్ణయము

**ఉత్సర్జనోపాకరణే న కార్యే గ్రస్తే శశాఙ్కే గురుశుక్రమూఢ।**
**శ్రావణపూర్ణిమాయాః మూఢాదిదోషసద్భావే ప్రోష్ఠబద్యాం వా కార్యమ్।**

తా॥ గురు శుక్ర మూఢములు, గ్రహణములు సంభవించినప్పుడు భాద్రపద పూర్ణిమకు(ప్రోష్టబద్యాం) ఆచరించాలి. **కనుక 6 సెప్టెంబరు 2017 బుధవారం భాద్రపద పూర్ణిమన యజుర్వేదీయులు ఉపాకర్మను ఆచరించవలయును.**

## శ్రీ కృష్ణాష్టమి నిర్ణయము

శ్రావణ బ.అష్టమే శ్రీకృష్ణజన్మాష్టమి. ఈ తిథిలో రోహిణి ఉంటే శ్రీకృష్ణజయంతిగా పిలుస్తారు. తిథిని అర్ధరాత్రి వ్యాపినిగా తీసుకోవాలి. రాత్రి భాగంలో మధ్య గల 2 ఘడియల కాలమే అర్ధరాత్రి. ఇది 2వజాము చివరి ఘడియ, 3వజాము తొలి ఘడియ కాలముగా భావించాలి. సూర్యాస్తమయం నుంచి మరునాటి సూర్యోదయం వరకు గల సమయాన్ని నాల్గు భాగాలు చేస్తారు. ఒక్కో భాగాన్ని జాము అంటారు.

**ఉదాహరణ పూర్వకంగా అర్ధరాత్రి సమయాన్ని గణించుట**

ఒకనాటి సూర్యాస్తమయం... సాయంత్రం 6గం.29ని॥లు
రెండవనాటి సూర్యోదయం.. ఉదయం 5గం.57ని॥లు
ఈ రెండింటి మధ్యకాలం 11గం॥28ని॥లుఅనగా 688 నిముషాలు. 688 ని॥లను 4 భాగాలు చేస్తే ఒక్కో భాగానికి 172 ని॥లు అనగా ఒక్కో జాముకు 2గం.52 నిముషాలు ఉండును.
1వ జాము - సా6గం॥29ని॥ల నుంచి రా9గం॥21ని॥ల వరకు
2వ జాము- రా9గం॥21ని॥ల నుంచి రా12గం॥13ని॥ల వరకు
3వ జాము- రా12గం॥13ని॥ల నుంచి తె3గం॥05ని॥ల వరకు
4వ జాము- తె3గం॥05ని॥ల నుంచి సూర్యోదయం వరకు (5.57)

ఇక 2వ జాములో చివరి ఘడియ, 3వ జాములో తొలి ఘడియను అర్ధరాత్రి అంటారు. ఘడియ అనగా 24 నిముషాలని అర్ధము.
2వజాములో చివరిఘడియ (రా12.13-24ని॥లు) = 11గం॥49ని॥లు
3వజాములో తొలి ఘడియ(రా12.13+24ని॥లు) = 12గం॥37ని॥లు
కనుక అర్ధరాత్రి సమయం రాత్రి 11.49 నుంచి 12.37 వరకు

స్మార్తులు, మాధ్వులు అష్టమి నిశీధి వ్యాప్తి ఉన్న రోజునే శ్రీకృష్ణాష్టమిగా ఆచరిస్తారు. కానీ వైష్ణవ సాంప్రదాయం ప్రకారంగా శ్రావణ బహుళ అష్టమి తిథి సమయానికి సూర్యగ్రహం సింహరాశిలో ఉండి తీరాలి. సప్తమి తిథితో కూడిన అష్టమి లేదా కృత్తికతో రోహిణి ఉండకూడదు. సూర్యోదయం నుంచే రోహిణి నక్షత్రం ఉండితీరాలి. అష్టమి తిథి లేకున్నప్పటికీ, నవమైనా దశమైనా చేసుకుంటారు. ఆనాడే వారి పర్వదినం, లేనిచో శ్రావణం వదిలి భాద్రపదంలో ఆచరిస్తారు.

ఈ వివరాన్ని ఎందుకు ఇస్తున్నానంటే, శ్రీకృష్ణాష్టమి, వైష్ణవ శ్రీకృష్ణ జయంతి ఒకేరోజు రావచ్చు, ఒకరోజు తేడాతో రావచ్చు, ఒకమాసం తేడాతో రావచ్చు. ఇలాంటి పరిస్థితులలో పండుగ ఈరోజా, ఆరోజా అనే అనుమానాలు వస్తుంటాయి. ఉడిపిలో ఉండే వైష్ణవులకు, ద్వారకలో ఉండే వైష్ణవులకు కూడా గతంలో వ్యత్యాసాలు వచ్చాయి.

గతంలో ఓప్రాంత వైష్ణవులు అర్ధరాత్రి రోహిణి ఉంటే చాలు, సూర్యోదయంలో కృత్తిక ఉన్నా ఫర్వాలేదు అనుకున్నారు. మరోప్రాంత వైష్ణవులు కృత్తికసలు ఉండకూడదు,సూర్యోదయం నుంచే రోహిణి ఉండి తీరాలి అన్నారు. అందుచే గత 2008 ఆగస్టు 24న ఓవర్గ వైష్ణవులు ఆచరిస్తే, మరోవర్గ వైష్ణవులు ఆగస్టు 25న ఆచరించారు. టి.విల వారు రెండింటినీ చూపించారు. చివరికి ప్రేక్షకులు ఏదీ నిర్ణయించుకోలేక ముక్కున వేలేసుకున్నారు. ఏది ఏమైనప్పటికీ అర్ధరాత్రి అష్టమి తిథి వ్యాప్తి ఉన్నటువంటి రోజును శ్రీకృష్ణజన్మాష్టమిగా ఆచరించాలి.

**శ్రీకృష్ణాష్టమి నిర్ణయం :** శ్రీ హేమలంబ శ్రావణ బహుళ అష్టమి 14 ఆగస్టు 2017 సోమవారం రాత్రి 7గం॥45ని॥లకు ప్రారంభమై, 15 మంగళవారం సా5గం॥39ని॥లకు ముగిసినది. స్మార్త, మాధ్వులకు నక్షత్రము కంటే తిథి ప్రధానము. ఇది అర్ధరాత్రి వ్యాప్తిగా ఉండాలి. కాబట్టి సోమవారం అర్ధరాత్రి అష్టమి తిథి ఉన్నది. మంగళవారం అర్ధరాత్రికి అష్టమి తిథి వ్యాప్తి లేదు. కనుక స్మార్తులు, మాధ్వులు 14 ఆగస్టు 2017 సోమవారం నాడు శ్రీకృష్ణాష్టమిని ఆచరించాలి.

**స్మార్త మాధ్వ శ్రీకృష్ణాష్టమి 14 ఆగస్టు 2017**

## శ్రీ కృష్ణజయంతి నిర్ణయము

అథ వైష్ణవశ్రీకృష్ణజయన్తీనిర్ణయః
సింహేర్కే రోహిణీయుక్తా నభః కృష్ణాష్టమీ యది।
రాత్ర్యర్ధపూర్వాపరగా జయన్తీ కలయాపి చ॥
శ్రావణస్య సితాష్టమ్యాం పఞ్చాస్యే న చేద్రవిః।
తదా భాద్రపదే కుర్యాజ్జయన్తీ రోహిణీయుతా।
యస్మిన్ వర్షే జయంత్యాఖ్యో యోగో యది న లభ్యతే।
జన్మాష్టమ్యేవ విద్వద్భిస్తయా కార్యా మహాఫలా॥...

సప్తమీవిద్ధాష్టమ్యాం శుద్ధాయా రోహిణ్యాస్సద్భావేపి
సా పరిత్యాజ్యా।
శుద్ధాష్టమ్యాం వహ్నివిద్ధాయా రోహిణ్యాస్సద్భావే
సాపి న జయన్తీ।
కిన్తు సప్తమీసమ్పర్కరహితాయామష్టమ్యాం...
కృత్తికాసమ్పర్కరహితాయా
రోహిణివ్యస్సద్భావే జయన్తీతి వైష్ణవానాం రాద్ధాన్తః॥

అష్టమ్యాం వా నవమ్యాం వా దశమ్యాం యది రోహిణీ।
సా జయన్తీతి విఖ్యాతా విష్ణువ్రతపరాయణైః॥

తా॥ రవి సింహరాశిలో ఉండగా శ్రావణ బహుళ అష్టమిన రోహిణి నక్షత్రం ఒక కలామాత్రమైనా ఉన్నచో దానిని శ్రీకృష్ణ జయంతి అంటారు. ఈ తిథి నాటికి సూర్యుడు సింహరాశిలో ప్రవేశించకపోయినచో, భాద్రపద బహుళ అష్టమిన శ్రీకృష్ణజయంతి చేయాలి. సప్తమితో కూడిన అష్టమి యందు రోహిణి ఉన్ననూ వీలులేదు. అలాగే కృత్తికతోటి రోహిణి ఉన్ననూ జయంతికి పనికిరాదు. కాబట్టి సప్తమి విద్ధలేని అష్టమి నాడు, కృత్తిక విద్ధ లేని రోహిణి ఉంటేనే శ్రీ కృష్ణజయంతి. నవమి గానీ, దశమి గానీ రోహిణి ఉంటేనే జయంతి అంటారు. ఇది వైష్ణవ సిద్ధాంతము.

అంతేకాక ఒకవేళ అన్నీ సరిగా ఉండి, ఆ సమయంలో సంక్రమణం జరిగితే... అది కూడా నిషిద్ధము. పైన చెప్పిన వైష్ణవ నిర్ణయాలను బట్టి శ్రీ హేమలంబ శ్రావణంలో రోహిణి నక్షత్రం 16 ఆగస్టు 2017 బుధవారం అర్ధరాత్రి 12గం॥50ని॥ల వరకు ఉన్నది.

ఆ సమయంలో బహుళ దశమి తిథి జరుగుతున్నది. కానీ శ్రీకృష్ణ చేయటానికి అవకాశం లేదు. ఎందుకంటే సూర్యుడు అర్ధరాత్రి 12గం॥47ని॥లకు సింహరాశిలోకి వచ్చాడు. ఈ సింహసంక్రమణం వారి నిర్ణయాలకు విరుద్ధము. అనగా శ్రావణమాసంలో ఆగస్టు 14,15,16 తేదీలలో వైష్ణవ శ్రీకృష్ణజయంతికి అవకాశం లేదు. కనుక భాద్రపదమాసంలో రోహిణి నక్షత్రం అర్ధరాత్రి వ్యాప్తితో సెప్టెంబరు 12 మంగళవారం ఉన్నది. కానీ ఆ సమయంలో సప్తమి తిథి ఉన్నది. కనుక పనికిరాదు. మరునాడు 13 బుధవారం రోజున ఆచరించాలి.

**అయితే 13 బుధవారం అర్ధరాత్రి వ్యాప్తికి అటు అష్టమి గానీ, ఇటు రోహిణి గానీ రెండునూ లేవు. అయినప్పటికీ కలామాత్రంగా అనే నియమానుసారంగా భావిస్తూ వైష్ణవులు శ్రీకృష్ణజయంతిని శ్రీ హేమలంబ సంవత్సర మహాలయ పక్షంలో అనగా భాద్రపద బహుళ అష్టమి 13 సెప్టెంబరు 2017న ఆచరించాలి. వారి నిర్ణయాల ప్రకారంగా ఒక్కోసారి పర్వదినం జరుపుకోవటం కష్టమవుతున్నది.**

**అందుచేత వైష్ణవనిర్ణయాలలో ఉడిపి వైష్ణవులకు, ద్వారక వైష్ణవులకు బేధాభిప్రాయాలు వచ్చినందున, రాజీధోరణిలో వెళ్లాలనే తలంపుతో వారు ఉన్నారనేది విశ్వసనీయ వర్గాల వారి సమాచారం.**

**భారత ప్రభుత్వ ఆమోదిత దృగ్గణిత ప్రకారం**
**శ్రీ కృష్ణజయంతిని**
**13 సెప్టెంబరు 2017న ఆచరించాలి.**

## నాగపంచమి - 27 జూలై

శ్రీ హేమలంబ శ్రావణ శుక్ల పంచమి రోజున నాగ(గరుడ)పూజను చేయాలి. శు.షష్ఠితో కూడిన పంచమిని గ్రహించి మట్టితో చేసిన నాగులను అర్చన చేయాలని భవిష్యోత్తర పురాణం తెల్పినది. ఈరోజున సూర్యోదయం తదుపరి మూడు ముహూర్తముల కాలం (2గం॥24ని॥లు) పంచమి తిథి ఖచ్చితముగా ఉండి, తదుపరి షష్ఠి తిథి ఉండాలి. ఒకవేళ 3 ముహూర్తాల కాలం పంచమి తిథి లేకుంటే, ముందురోజునే చవితితో కూడిన పంచమి తిథిని నాగ(గరుడ) పంచమిగా నిర్ణయించాలి.

**శ్రావణశుక్లపఞ్చమ్యాం నాగపూజా కార్యా। సా పరవిద్ధా గ్రాహ్యా।**
**తథా చోక్తం భవిష్యోత్తరే...**
**షష్ఠీయుతాయాం పఞ్చమ్యాం శ్రావణస్య సితే సదా।**
**పూజయేత్ పన్నగాన్ సర్వాన్ మృణ్మయాన్ పయసాదిభిః॥**
**పర్యేద్యుః పఞ్చమీ త్రిముహూర్తా నో చేత్ పూర్వైవ గ్రాహ్యా।**
**ముహూర్తత్రితయాదల్పా యది చతుర్థీయుతైవ గ్రాహ్యేత్యర్థతస్సిద్ధమ్॥**

28 జూలై 2017 శుక్రవారం శ్రావణ శు.పంచమి ఉ6గం॥38ని॥ల వరకే ఉండి తదుపరి షష్ఠి తిథి వచ్చినది. భవిష్యోత్తర పురాణంలో ఇచ్చిన నిర్ణయాల ప్రకారంగా 28 శుక్రవారం సూర్యోదయం తదుపరి 3 ముహూర్తాల (6ఘడియలు) కాలం పంచమి తిథి లేదు. అందుచేత 27 జూలై 2017 గురువారం చవితితో కూడిన పంచమిని గ్రహించాలి.

**కనుక గరుడ (నాగ)పంచమి 27 జూలై 2017 గురువారం**

## నాగచతుర్థి - 23 అక్టోబరు

శ్రీ హేమలంబ సంవత్సర కార్తిక శుక్ల చవితి తిథి 23.10.2017 సోమవారం పూర్తిగా ఉన్నది. రెండవరోజు మంగళవారం 24 అక్టోబరు 2017న ఉదయం 7గం॥06ని॥లవరకే చవితి తిథి ఉన్నది. నాగచతుర్థి మరియు వినాయకచవితి పర్వదినాలకు చవితి తిథి మధ్యాహ్నవ్యాప్తిలో ఉండాలని ధర్మసింధు, నిర్ణయసింధు మరియు ఇతర ధర్మశాస్త్రాల నిర్ణయానుసారంగా **అక్టోబరు 23 సోమవారం నాడు నాగచతుర్థికి పూర్ణ గుణాధిక్యత ఉన్నందున వల్మీక పూజ, నాగచతుర్థి వ్రతము 23 సోమవారం ఆచరించాలి.**

## సుబ్రహ్మణ్య షష్ఠి - 24 నవంబరు

శ్రీ హేమలంబ మార్గశిర శుక్ల షష్ఠి సుబ్రహ్మణ్య షష్ఠి. నవంబరు 24 శుక్రవారం రోజున షష్ఠి తిథి పూర్తిగా ఉండి, మరునాడు 25 శనివారం ఉదయం గం॥7.57ని॥లతో షష్ఠి తిథి పూర్తవుతున్నది. ఈ రెండు రోజులలోను సూర్యోదయంలో షష్ఠి తిథి ఉన్నది.

ధర్మశాస్త్ర నిర్ణయాలను అనుసరించి సుబ్రహ్మణ్యషష్ఠిని నిర్ణయించాలి.

**మార్గశీర్షశుక్లషష్ఠ్యాం స్కన్దవ్రతం కార్యమ్। యదా షష్ఠీ త్రిముహూర్తవ్యాపినీ భవతి తదా స్కన్దపూజనే పరా గ్రాహ్యా। నో చేత్ పూర్వైవ తథా చోక్తం స్కాన్దే – మార్గశీర్షే సితే పక్షే కర్తవ్యం స్కన్దపూజనమ్। త్రిముహూర్తా చ యా షష్ఠీ పరా సైవాన్యథా పురా॥**

**తా॥** షష్ఠి తిథి రెండు రోజులున్నచో పరదినమును తీసుకోవాలి. అయితే పరదినమైనా తిథి మూడు ముహూర్తముల కాలం తప్పక వ్యాపించి ఉండాలి. (ముహూర్తమనగా 48 నిముషాలు.మూడు ముహూర్తములు అనగా 144 నిముషాలు. అంటే 2గంటల 24నిముషాలని అర్ధము.)

**తా॥** పరదినమున సూర్యోదయం తదుపరి 3 ముహూర్తములు షష్ఠి తిథి లేకున్నచో పూర్వదినమునే గ్రహించాలని స్కాందము తెలియజేసింది.

**25న సూర్యోదయం తదుపరి తిథి 3ముహూర్తాల వ్యాప్తి లేదు.**
**కనుక నవంబరు 24 శుక్రవారమే సుబ్రహ్మణ్య షష్ఠి.**

## మహాశివరాత్రి - 14 ఫిబ్రవరి 2018

శ్రీ హేమలంబ మాఘ బహుళ చతుర్దశి తిథి 2018 ఫిబ్రవరి 13 మంగళవారం రాత్రి గం॥10.34ని॥లకు ప్రారంభమై, మరునాడు ఫిబ్రవరి 14 బుధవారం రాత్రి 12గం॥46ని॥లకు ఉన్నది.

బహుళ చతుర్దశి మహాశివరాత్రి. తిథి అర్ధరాత్రి వ్యాపినిగా ఉండాలి. అయితే 13 మంగళవారం అర్ధరాత్రి చతుర్దశి తిథి ఉన్నది. అలాగే 14 బుధవారం అర్ధరాత్రి కూడా చతుర్దశి తిథి ఉన్నది. కనుక ఈ రెండు రోజులలో మహాశివరాత్రి పర్వదినాన్ని ఏరోజున నిర్ణయించాలి?

**1.అస్యామేవ మహాశివరాత్రిః అర్ధరాత్రవ్యాపినీ గ్రాహ్యా।**
**ఉక్తఞ్చ ధర్మప్రవృత్తౌ స్కన్దపురాణే ----- నిశీథవ్యాప్తిశ్చతుర్థా।**
**పూర్వేద్యుః పరేద్యురుభయేద్యురనుభయేద్యురితి।**
**తత్రాద్యయోరసన్దేహః ముఖ్యకాలవ్యాప్తేస్తత్వాత్।**

**తా॥** అర్ధరాత్రి వ్యాప్తి నాల్గు రకములు.

1.ముందురోజు అర్ధరాత్రిలో చతుర్దశి తిథి ఉండుట
2.రెండవరోజు అర్ధరాత్రిలో చతుర్దశి తిథి ఉండుట
3.రెండు దినముల యందు అర్ధరాత్రిలో చతుర్దశి తిథి ఉండుట
4.రెండు దినముల అర్ధరాత్రిలో చతుర్దశి తిథి లేకుండుట.

మొదటి 2 పద్ధతులలో సందేహం లేదని ధర్మప్రవృత్తి, స్కన్దపురాణం మొదలైన గ్రంథములు స్పష్టముగా తెలియజేసినవి.

**2. తృతీయపక్షే పరా గ్రాహ్యా। ఉక్తఞ్చ స్కాన్దే –**
**దినద్వయేన్యర్ధరాత్రే వర్తతే యా చతుర్దశీ।**
**తదా పరైవ కర్తవ్యా న తు పూర్వా కదాచన॥**

**తా॥** మూడవ పద్ధతిలో రెండుదినముల యందు అర్ధరాత్రి సమయంలో తిథి ఉండినచో, అప్పుడు రెండవదినమునే గ్రహించాలి కానీ, మొదటి దినమును గ్రహించరాదని స్కన్దపురాణం పేర్కొంది.

**3. చతుర్థపక్షేపి పరా గ్రాహ్యా। ఉక్తఞ్చ స్కాన్దే –**
**దినద్వయే యదా న స్యాన్మధ్యరాత్రే చతుర్దశీ।**
**తదా పూర్వాం పరిత్యజ్య కర్తవ్యా సా నరైః పరా॥**

**తా॥** రెండు దినములలో అర్ధరాత్రి చతుర్దశి తిథి లేని 4వపద్ధతిలో కూడా పరదినమునే గ్రహించాలని స్కన్దపురాణం స్పష్టం చేసింది.

**పరస్మిన్ దినే ప్రదోషవ్యాప్తిరూపగుణస్యాధిక్యాత్ పరైవ గ్రాహ్యేతి।**

**తా॥** రెండవ రోజు ప్రదోషకాలములో చతుర్దశి ఉన్నప్పుడు పరదినమునే గ్రహించాలని స్కన్దపురాణం పేర్కొన్నది.

**కనుక పైన తెల్పిన నిర్ణయాల ప్రకారంగా**
**14 ఫిబ్రవరి 2018 బుధవారం నాడే**
**మహాశివరాత్రి పర్వదినము**

**విశిష్ట దేవస్థానమైన తిరుమల తిరుపతి ఆస్థాన సిద్ధాంతి గారు, కంచి పీఠం ఏర్పాటు చేసిన సభలో మార్చి 28 ఉగాదిగాను, 2018 ఫిబ్రవరి 14 మహాశివరాత్రి గాను ఒప్పుకొని సంతకం చేసి, సన్మానింపబడి, బయటకు వెళ్లి పండిత ధిక్కారంతో ఉగాది పండుగను మరియు మహాశివరాత్రిని వేరు తేదీలతో ప్రకటించి తెలుగు ప్రజలను అయోమయంలో పడేశారు. కనుక పాఠకులు గమనించి పూర్వగణిత పంచాంగాలకు తక్షణమే స్వస్తి చెప్పాలని మా విన్నపము.**
**– తెలుగు రాష్ట్రాల దృగ్గణిత పంచాంగకర్తలు**

శ్రీ మహాగణాధిపతయే నమః　　శ్రీమాత్రే నమః　　శ్రీ మద్వేంకటేశాయ నమః

# శ్రీ హేమలంబ నామ సంవత్సర ప్రామాణిక సూర్యసిద్ధాంత పంచాంగం

కలియుగ శతాబ్దములు **5118**
శ్రీ ఆదిశంకరాచార్యాబ్దములు **2088**
శాలివాహనశకాబ్దములు **1939**
భారత స్వాతంత్ర్య శకము **70-71**



ఫసలీ శతాబ్దములు **1425 -1426**
హిజరీ శకాబ్దములు **1437 - 1438**
శ్రీరామానుజాబ్దములు **1000**
ఆంగ్ల పద్ధతి **2017 - 2018**

*కలియుగ ప్రమాణము 4లక్షల 32వేల సంవత్సరములు. శ్వేతవరాహకల్పము నందలి 7వదైనటువంటి వైవస్వత మన్వంతరములోని 28వ మహాయుగమునందలి కలియుగ ప్రథమ పాదములో 5118వదియు, ప్రభవాది 60 సంవత్సరాలలో 31వ దైనటువంటి ఈ సంవత్సరమును చాంద్రమానంచే శ్రీ 'హేమలంబ' నామ సంవత్సరముగా పేర్కొందురు. ప్రతి ఐదు సంవత్సరాలను ఒక యుగముగా లెక్కించినచో, ప్రభవాది అరవై సంవత్సరాలను పన్నెండు యుగాలుగా భావించాలి. ప్రతి యుగములోని ఐదు సంవత్సరాలను వరుసగా సంవత్సర, పరివత్సర, ఇదావత్సర, అనువత్సర, ఇద్వత్సరములని పిలువబడును.*
*ఈ పరంపరలో 7వయుగములోని 'సంవత్సర'మను నామంతో ఉన్న ప్రథమ సంవత్సరమే శ్రీ హేమలంబ నామ సంవత్సరం.*

## రాజాధి నవనాయక నిర్ణయాలు

**మంత్రి : శుక్రుడు**
**సేనాధిపతి : బుధుడు**
**సస్యాధిపతి : రవి**
**ధాన్యాధిపతి : శని**




**అర్ఘాధిపతి: గురువు**
**మేఘాధిపతి: గురువు**
**రసాధిపతి : కుజుడు**
**నీరసాధిపతి: రవి**

### రాజ్యాధిపతి - కుజుడు

355 రోజులుండే శ్రీ హేమలంబ సంవత్సరానికి రాజు కుజుడు. కేవలం 9 రాశులలోనే కుజుడు సంచారం సాగించి, తన ఉచ్ఛస్థానంలో సంచారం లేకపోవటం గమనార్హం. అంచేత పూర్తిస్థాయిలో ప్రజారంజకంగా పరిపాలన సాగించలేదు. రాజుకి ధైర్యసాహసాలు ఉన్ననూ ఆగస్టు 18 నుంచి 27 వరకు సమస్యలు ఎదుర్కోలేక అయోమయ పరిపాలన ఉండును. మే 27 నుంచి జూలై 11 వరకు, శతృసంఘర్షణలతో పరిపాలన సాగును. కార్మిక కర్షక రంగాలపై దృష్టి ఉంచలేడు. ప్రజలలో ద్వేషభావము పెరుగును. తనకు తెలియకుండానే అంతర్గత కలహాలను సృష్టించే వారిని రాజైన కుజుడు తెలివి తేటలతో తనదైన శైలిలో శిక్షించును. మొత్తం మీద పరిపాలన సంతృప్తికరంగానే సాగిపోవును.

### సేనాధిపతి - బుధుడు

శ్రీ హేమలంబ సంవత్సరానికి సేనాధిపతి బుధుడు. ప్రజ్ఞా పాటవాలున్ననూ, ఇతర గ్రహసంచారాల ప్రభావంచే సేనాధిపతి నిర్ణయాలకి విలువ లేకుండా పోవును. శాంతి భద్రతలను కాపాడటానికి ఆడంబర, ఆర్భాటాలతో దూకుడున్ననూ శతృవులను ఎదుర్కోలేరు. రౌడీయిజంపై ధైర్యసాహసాలతో ఉక్కుపాదం మోపలేరు. ప్రభుత్వ శాసనాలను ఒక్కోసారి రక్షణశాఖ సరిగ్గా పాటించలేదు. రక్షణశాఖలోని అవినీతి పరులచే పాలకులకు ప్రజలలో చెడ్డపేరు వచ్చును. సేనాధిపతుల వైఫల్యంచే మాఫియా గణం తమ కార్యకలాపాలను యధేచ్ఛగా ఉధృతం చేయటంతో చివరకు నష్ట పోయేది సాధారణ పౌరులని ఆలస్యంగా తెలియును. విలాసవంతులకు పెద్దపీటలు వేయుదురు.

### మంత్రి - శుక్రుడు

శ్రీ హేమలంబ సంవత్సర మంత్రి శుక్రుడు. సంవత్సర ప్రారంభం నుంచి రాజుకు వెనుకగా అనుసరిస్తూ ఆగస్టు 22 నుంచి అక్టోబరు 9 వరకు రాజుతో కలిసి సంచారం చేస్తూ, అక్టోబరు 9 నుంచి రాజు కంటే ముందుగానే భచక్రాన్ని పూర్తి చేయటానికై మంత్రి సన్నద్ధుడైననూ, ఏ ఒక్క నిర్ణయాన్ని రాజు స్వీకరించడు. నిర్దుష్ట ప్రణాళికలను,సూచనలు సలహాలు మంత్రి ఇవ్వలేడు. 28 నవంబరు నుంచి 2018 ఫిబ్రవరి 19 వరకు మంత్రి అస్తగత్వంచే సంగీత, సాహిత్య, కళా, సినీ, వస్త్ర,టెక్నాలజీ రంగాలకు సమస్యలు. సపిడి వ్యాపారంపై నీలినీడలు. వివాహాల రద్దీ తగ్గినందున సంబంధిత రంగాలు తీవ్రనష్టాలతో దిక్కుతోచని స్థితిలో ఉంటాయి.

### సస్యాధిపతి - రవి

శ్రీ హేమలంబ సంవత్సరానికి సస్యాధిపతి రవి. గోధుమ పంట పుష్కలంగా పండును. ఇతర పంటల విషయంలో తొలకరి కంటే రెండవ సారి వేసే పంటలు విశేషంగా ఫలించును. నదీమాతృక భూములు సామాన్యంగా ఫలిస్తాయి. వ్యవసాయ కూలీలకు లబ్ధి చేకూరును. ఋణ సౌకర్యంలోను, క్రిమి సంహారక మందుల పొందుటలో రైతాంగానికి సమయం వృధా అవుతుంది. ఋతుపవనాలు సకాలంలో రావటంచే సమయానికి వర్షాలు కురిసినందున పశువులకు మేత పుష్కలమై, తద్వారా పాడిపరిశ్రమ దూసుకు వెళ్లును. 2017 డిశంబరు నాటికి దీర్ఘకాల నిల్వ సస్యములు దెబ్బతినే సూచన కలదు. కనుక పలు జాగ్రత్తలు తీసుకోవలసి ఉండును.

### ధాన్యాధిపతి - శని

శ్రీ హేమలంబలో ధాన్యాధిపతి శని. ఏప్రిల్ 11 నుంచి జూన్ 21 వరకు 71రోజుల పాటు ధాన్యాధిపతి వక్రనడక కారణంగా 2017 ఏప్రిల్ 13 నుంచి మే 26 వరకు ధాన్యానికి గిట్టుబాటు ధరలుండవు. తదుపరి నుంచి జూలై 11 వరకు బడాబాబుల కనుసన్నలలో వ్యాపారాలు జరుగును. ఇందుచే మొదటి ఆరుమాసాలు అన్నదాతలు సంతోషంగా ఉండలేరు. 2017 అక్టోబరు 27 నుంచి 2018 మార్చి 7 వరకు గల శని సంచార ప్రభావంచే అన్నదాతలు కొంతవరకు సంతృప్తి పడేలా ఉంటారు. కానీ 2018 జనవరి నెల మొదటిపక్షంలో వాతావరణ ప్రభావంచే ధాన్యనష్టమయ్యే అవకాశం ఉంది.కనుక జాగ్రత్త.

## మేఘాధిపతి గురువు

నైఋతిఋతుపవనాలచే తొలకరి ప్రారంభమై, ఆశలు చిగురుచ్చును. మేఘాధిపతి గురువైనందున అనుకూల వర్షాలతో పంటలు పండును. ప్రజలకు రోగ భయముండదు. అక్టోబరు డిశంబరు, 2018 జనవరిలలో తుఫాను కారణాలచే అధికవర్షపాతముంది. జనవరిలో ప్రజలు అనేక జాగ్రత్తలు తీసుకోవాలి. ఒక్కోసారి కలుషిత జలమున్ననూ తగు జాగ్రత్తలు తీసుకుంటూ ప్రజలు నీటిని వినియోగించుకోవాలి.

## రసాధిపతి కుజుడు

రసవస్తువుల ఉత్పత్తి పెరగటంతో నూనె నువ్వులు నెయ్యి బెల్లం ఉప్పు ధరలలో హెచ్చుతగ్గులుండును. స్త్రీలకు గర్భకోశ వ్యాధులు అధికమగును. వివాహవ్యవస్థలో న్యాయస్థానాల తీర్పులు అత్యధికము. తీర్థయాత్రలు చేయువారులలో అధికభాగం రక్తప్రసరణ పెరిగి క్రోధంతో ఊగిపోవుదురు. పంట నష్టాలు రావటంచే కొందరు రైతులు ఋణబాధలు తట్టుకోలేక ఆత్మహత్యలకు పాల్పడటం జరుగును.

## నీరసాధిపతి రవి

బంగారం మణులు రత్నాలు ముత్యాలు రాగి గంధం కర్పూరం వెండి తగర వృద్ధిలో హెచ్చు తగ్గులుండును. నవరత్న వ్యాపారం తగ్గును. కర్పూర వినియోగం పెరుగును. సాఫ్ట్‌వేర్ ఉపకరణాల ధరలు సంవత్సర మధ్య నుంచి తగ్గును. తీపి మిఠాయి తయారీదారుల వ్యాపారం జోరు తగ్గును. చౌకబారు రుద్రాక్షలను, జాతి రత్నాలను, పూజావస్తువులను అమ్మేవారు పుట్ట గొడుగులులా తయారై ప్రజాధనాన్ని కొల్లగొట్టుదురు.

## అర్ఘాధిపతి గురువు

మార్కెట్ అంతా నకిలీమయంగా ఉండును. పోటీ మార్కెట్‌లో వినియోగదారులు ఉచిత వస్తువుల భ్రాంతిలో తీవ్రంగా మోసపోవుదురు. అధిక కార్తెలు గురువారాలే వచ్చినందున ప్రజానీకానికి నిత్యావసర వస్తువులకు రెక్కలు వచ్చును. పలుసార్లు స్టాక్ మార్కెట్ పతనమై, భారీకంపెనీల షేర్‌విలువలు తగ్గటంతో భారతీయ వాణిజ్యం నష్టాలబాటలో ఉండును. పసిడిమార్కెట్‌కు పరుగులు అధికంగా ఉండవు. వెండి ధరలు సాధారణం.

## 1వ శుక్రమౌఢ్యమి ( 2017 మార్చి 20 - 30 )

గత దుర్ముఖి ఫాల్గుణ బ.అష్టమి సోమవారం 20 మార్చి 2017 సా4గం॥13ని॥లకు పశ్చిమంలో ఉత్తరాభాద్ర నక్షత్ర 4వపాదాన వక్ర శుక్రుడు అస్తమించుటచే శుక్ర మౌఢ్యమి ప్రారంభమగును. ప్రస్తుత హేమలంబ సంవత్సర చైత్రమాస శు.తదియ గురువారం 30 మార్చి 2017 మ3గం॥49ని॥లకు తూర్పుదిశన ఉత్తరాభాద్ర నక్షత్ర 2వ పాదంలో వక్ర శుక్రుడు ఉదయించుటచే శుక్రమౌఢ్యమి త్యాగమగును.

## గురుమౌఢ్యమి ( 2017 అక్టో 12 - నవం 9)

శ్రీ హేమలంబ ఆశ్వీజ బహుళ అష్టమి గురువారం 12 అక్టోబరు 2017 రాత్రి 7గం॥35ని॥లకు తులారాశిలో చిత్ర నక్షత్ర 4వ పాదంలో పశ్చిమదిశన గురుగ్రహం అస్తమించుటచే గురుమౌఢ్యమి ప్రారంభమగును. ఇది కార్తిక బహుళ సప్తమి గురువారం 9 నవంబరు 2017 రాత్రి 12గం॥30ని॥లకు తూర్పుదిశన స్వాతి నక్షత్ర రెండవపాదంలో శుభ గ్రహమైన గురువు ఉదయించుటచే గురుమౌఢ్యమి త్యాగమగును.

## 2వ శుక్రమౌఢ్యమి ( 2017 నవం 28- 2018 ఫిబ్ర 20)

శ్రీ హేమలంబ మార్గశిర శు.దశమి మంగళవారం 28 నవంబరు 2017 రాత్రి 12గం॥42ని॥లకు తులారాశిలో తూర్పుదిశన విశాఖ నక్షత్ర 4వపాదంలో శుక్రుడు అస్తమించుటచే శుక్రమౌఢ్యమి ప్రారంభమై, శ్రీ హేమలంబ ఫాల్గుణ శుక్ల పంచమి మంగళవారం 20 ఫిబ్రవరి 2018 సూర్యోదయానికి పూర్వం 3గం॥54ని॥లకు పశ్చిమదిశన కుంభ రాశిలో శతభిషం 4వపాదంలో ఉదయించుటచే శుక్రమౌఢ్యమి త్యాగమగును.

## వాస్తు, అగ్ని కర్తరులు మే 4 - 25

శ్రీ హేమలంబ వైశాఖ శుక్ల నవమి గురువారం 4.5.2017 మ2గం॥38ని॥లకు శ్రీ సూర్య భగవానుడు భరణి నక్షత్ర 3వపాద ప్రవేశంతో వాస్తుకర్తరి ప్రారంభమగును. ఇది మే 28 ఆదివారం జ్యేష్ఠ శుక్ల తదియ రాత్రి 7గం॥33ని॥లకు రోహిణి నక్షత్ర 2వపాదంలోకి సూర్యుడు ప్రవేశించటంతో వాస్తుకర్తరి ముగిసిపోవును. శంఖుస్థాపనలు చేయరాదు. గృహప్రవేశాలు, ఇంటి మర్మమత్తులు చేయవచ్చు. నిర్మించిన గృహాలపై 2వ అంతస్థుగా పూజా కార్యక్రమాలతో ప్రారంభించవచ్చును.

శ్రీ హేమలంబ వైశాఖ బ.పాడ్యమి 11.5.2017 గురువారం మ12గం॥02ని॥లకు రవి కృత్తిక 1వపాద ప్రవేశంతో అగ్నికర్తరి ప్రారంభమై, వైశాఖ అమావాస్య గురువారం మే 25 ఉదయం 8గం॥16ని॥లకు కృత్తికను విడుచుటచే అగ్నికర్తరి త్యాగమగును. నూతులుత్రవ్వుట, గడ్డితో ఇండ్ల కప్పులు వేయుట నిషిద్ధం. యంత్రాలతో నూతులు త్రవ్వవచ్చు, అలాగే సిమెంట్ స్లాబ్‌లు వేసుకోవచ్చు.

## మకర సంక్రమణం

శ్రీ హేమలంబ నామ సంవత్సర పుష్యమాసం బ.త్రయోదశి ఆదివారం 14 జనవరి 2018 మూల నక్షత్ర ధృవ యోగ, వణిజకరణ సమయం మధ్యాహ్నం 1గం॥46ని॥లకు జగద్రక్షకుడైన శ్రీ సూర్యనారాయణుడు ఉత్తరాషాఢ నక్షత్ర రెండవపాదమైన మకరరాశి ప్రవేశం చేయటంతో ఉత్తరాయణ పుణ్యకాలం ప్రారంభమగును.

శ్రీ హేమలంబ సంవత్సర మకరసంక్రాంతి పుణ్యపురుషుడు కాశ్యపస గోత్రోద్భవుడై, **'ఘోర'** అను నామధేయం కలిగి, అగరు స్నానమాచరించి, కంబళ వస్త్రమును ధరించి, సౌగంధమును లేపనముగా పూసుకుని, నల్లకలువపుష్పమును చేతనుంచి, పగడాభరణములను... చిల్లకోలను ఆయుధముగా ధరించి, మయూర ఛత్రమును గైకొని, తగరపు పాత్రలోని పెరుగు మరియు తాటిపండును ఆహారంగా తీసుకుంటూ, నాలుకచాపి దున్నపోతు వాహనంపై వాయువ్య దిక్కుగా ప్రయాణం సాగిస్తున్నాడు.

**ఘోర నామకుడు          దున్నపోతు వాహనం**

ఈ మకరరాశిలోనికి సూర్య సంక్రమణ సమయానికున్న గ్రహస్థితుల ప్రభావంచే సువృష్టి ఏర్పడును. సర్వజంతువులు సుఖప్రదంగా ఉండును. సరిహద్దులలో యుద్ధభయ వాతావరణం విపరీతంగానున్ననూ రాజులకు ప్రాణభయం లేదు (పాలకుల జాతకస్థితిగతులపై ఈ అంశం ఆధారపడి ఉండును). దుష్టులకు హాని జరుగును. కొంతమంది ఆశ్రమాధిపతులకు (పీఠాధిపతులు) గడ్డురోజులుగా ఉండి శరీరరుగ్మతలతో తేజోహీనులవటం లేదా శివైక్యం కాగల అవకాశము. వేసవి ఫలాలకు ఇబ్బందులధికం. ఆకలి దప్పులతో అలమటించేవారి సంఖ్య తగ్గును. దుర్మార్గులకు కఠిన దండనలు. విషపూరిత రుగ్మతల వ్యాప్తి తగ్గుముఖం పట్టును.

2018 జనవరి 14 ఆదివారం మకరసంక్రాంతిన వంశాభివృద్ధికై, పితృదేవతలు సంతోషించేలా, శక్తి కొలది దాన, తర్పణ కార్యక్రమాలను ఆచరించినచో సర్వసౌఖ్యములతో వంశాభివృద్ధి కల్గి మనశ్శాంతినుండునని శాస్త్రవచనము. మధ్యాహ్నం 1గం॥46ని॥ల నుంచి సూర్యాస్తమయం వరకు మకరసంక్రమణ పుణ్యకాలం. గడియారాలలో సమయ తేడాలుండును, కనుక పుణ్యకాలం మధ్యాహ్నం 2 గంటల నుంచి అని గుర్తుంచుకొనేది.

## కావేరీ నది పుష్కర నిర్ణయం

శ్రీ హేమలంబ భాద్రపద బ.సప్తమి మంగళవారం తే12.9.2017ది ఉ6గం॥51ని॥లకు పుష్కరరాజు గురువు చిత్ర నక్షత్ర 3వపాద తులారాశిలోకి ప్రవేశించుటచే, సార్ధ త్రికోటి తీర్థ సహిత కావేరీ నదికి పుష్కరాలు ప్రారంభమగును. కావేరిని దక్షిణగంగగా పిలుస్తారు. తమిళనాడులో చిదంబరం శ్రీరంగం తంజావూరు కుంభకోణాలలో నదీ తీర పుణ్యక్షేత్రాలున్నవి. సెప్టెంబరు 12 నుంచి 23 వరకు పన్నెండురోజుల పాటు పితృదేవతల సంతృప్తికై తర్పణ పిండ ప్రదానాదులు ఆచరించేది.

## 2017 - ముఖ్య కార్తెలు - ఫలితాలు

| కార్తెలు | ప్రవేశతేది | వారం | సమయం | ఫలితం |
|---|---|---|---|---|
| అశ్వని | ఏప్రిల్ 13/14 | గు/శు | రా02.04 | ఉష్ణం |
| భరణి | ఏప్రిల్ 27 | గురు | సా05.52 | ఉష్ణం |
| కృత్తిక | మే 11 | గురు | మ12.02 | ఉక్కపోత |
| రోహిణి | మే 25 | గురు | ఉ08.16 | వడగాలులు |
| మృగశిర | జూన్ 8 | గురు | ఉ06.06 | ఆవర్తనం |
| ఆర్ద్ర | జూన్ 22 | గురు | ఉ05.08 | పీడనం |
| పునర్వసు | జూలై 6 | గురు | ఉ04.39 | వర్షం |
| పుష్యమి | జూలై 20 | గురు | ఉ04.14 | భారీవర్షం |
| ఆశ్లేష | ఆగస్ట్ 2/3 | బు/గు | రా03.03 | వా.గుండం |
| మఘ | ఆగస్ట్16/17 | బు/గు | రా12.47 | వా.గుండం |
| పుబ్బ | ఆగస్ట్ 30 | బుధ | రా08.39 | వా.గుండం |
| ఉత్తర | సెప్టెం 13 | బుధ | మ02.35 | ఆవర్తనం |
| హస్త | సెప్టెం 27 | బుధ | ఉ05.59 | తుఫాను |
| చిత్ర | అక్టో 10 | మంగళ | రా07.03 | తుఫాను |
| స్వాతి | అక్టో 24 | మంగళ | ఉ05.28 | తుఫాను |
| విశాఖ | నవం 6 | సోమ | మ01.40 | వా.గుండం |
| అనూరాధ | నవం 19 | ఆది | రా07.40 | సువృష్టి |
| జ్యేష్ఠ | డిశం 2 | శని | రా11.58 | మేఘావృతం |
| మూల | డిశం 15/16 | శు/శ | రా03.01 | చలితీవ్రత |

## ఆదాయ వ్యయ రాజ్య పూజ్యావమానములు

| రాశులు | ఆదాయము | వ్యయము | రాజ్యపూజ్యం | అవమానం |
|---|---|---|---|---|
| మేషం | ఎనిమిది | పధ్నాలుగు | నాలుగు | మూడు |
| వృషభం | రెండు | ఎనిమిది | ఏడు | మూడు |
| మిథునం | ఐదు | ఐదు | మూడు | ఆరు |
| కర్కాటకం | పధ్నాలుగు | రెండు | ఆరు | ఆరు |
| సింహం | రెండు | పదకొండు | రెండు | రెండు |
| కన్య | ఐదు | ఐదు | ఐదు | రెండు |
| తుల | రెండు | ఎనిమిది | ఒకటి | ఐదు |
| వృశ్చికం | ఎనిమిది | పధ్నాలుగు | నాలుగు | ఐదు |
| ధనస్సు | పదకొండు | ఐదు | ఏడు | ఐదు |
| మకరం | పధ్నాలుగు | పధ్నాలుగు | మూడు | ఒకటి |
| కుంభం | పధ్నాలుగు | పధ్నాలుగు | ఆరు | ఒకటి |
| మీనం | పదకొండు | ఐదు | రెండు | నాలుగు |
| సర్వాదాయము 59 - సర్వవ్యయము 71 | | | | |

## కందాయ ఫలములు

| నక్షత్రం | ఫలములు | నక్షత్రం | ఫలములు | నక్షత్రం | ఫలములు |
|---|---|---|---|---|---|
| అశ్వని | 1-1-1 | మఖ | 4-1-3 | మూల | 7-1-0 |
| భరణి | 4-2-4 | పుబ్బ | 7-2-1 | పూర్వాషాఢ | 2-2-3 |
| కృత్తిక | 7-0-2 | ఉత్తర | 2-0-4 | ఉత్తరాషాఢ | 5-0-1 |
| రోహిణి | 2-1-0 | హస్త | 5-1-2 | శ్రవణం | 0-1-4 |
| మృగశిర | 5-2-3 | చిత్ర | 0-2-0 | ధనిష్ఠ | 3-2-2 |
| ఆర్ద్ర | 0-0-1 | స్వాతి | 3-0-3 | శతభిషం | 6-0-6 |
| పునర్వసు | 3-1-4 | విశాఖ | 6-1-1 | పూర్వాభాద్ర | 1-1-3 |
| పుష్యమి | 6-2-2 | అనూరాధ | 1-2-4 | ఉత్తరాభాద్ర | 4-2-1 |
| ఆశ్లేష | 1-0-0 | జ్యేష్ఠ | 4-0-2 | రేవతి | 7-0-4 |

## శ్రీ హేమలంబలో పండుగలు వ్రతాలు - ముఖ్యదినాలు

**మార్చి 2017**

28. శ్రీ హేమలంబ ఉగాది వసంతనవరాత్రారంభం, తైలాభ్యంగనం, నవవస్త్రాభరణధారణ, నింబకుసుమభక్షణం, బ్రహ్మదమనపూజ
29. చైత్రమాసచంద్రోదయం ఉమాశివాగ్నిదమనపూజ
30. రజ్జబ్ నెల ప్రారంభం ఉత్తమమన్వాది,శివడోలోత్సవం సౌభాగ్యగౌరీవ్రతం సౌభాగ్యశయనవ్రతం శుక్రమౌఢ్యత్యాగం
31. గణేశదమనపూజ

**ఏప్రిల్ 2017**

1. శాలిహోత్రహయ5మి, నాగదమనపూజ, కూర్మకల్పాది పంచమూర్తివ్రతం, శ్రీవ్రతం
2. స్కందదమనారోపణం రమణమహర్షిజయంతి
2. యమునాజయంతి (మధుర) భానుషష్ఠి
3. సూర్యదమనపూజ
4. శ్రీరామనవమి, అశోకాష్టమి
5. వైష్ణవశ్రీరామజయంతి మహిషాసురమర్దని-దమనారోపణం
6. ధర్మరాజదశమి శాలివాహనజయంతి
7. కామదాఏకాదశి, విష్ణుడోలోత్సవం
8. వామనద్వాదశి,మన్మథపూజ శనిత్రయోదశిప్రదోషం అనంగత్రయోదశి (పూర్వవిద్ధగ్రాహ్య)
9. మహావీరజయంతి
9. శైవదమనచతుర్దశి, ఒంటిమిట్టశ్రీరామకల్యాణం
10. కర్దమక్రీడ,రౌచ్యమన్వాది
10. హనుమద్విజయోత్సవం
11. మహాచైత్రి, శచీంద్రపూజ చిత్రగుప్తవ్రతం
12. పాతాళవ్రతం
14. మేషసంక్రాంతి, విషు(కేరళ)
14. తమిళసంవత్సరాది,గుడ్‌ఫ్రైడే సంకష్టహరచతుర్థి
16. ఈస్టర్‌సండే
22. వరూధినీఏకాదశి
25. వరాహజయంతి మాసశివరాత్రి కృష్ణఅంగారక చతుర్దశి
27. వైశాఖచంద్రోదయం
28. త్రేతాయుగాది,అక్షయతదియ పరశురామజయంతి షాబాన్‌నెలప్రారంభం సింహాచల చందనోత్సవం
30. శ్రీ శంకరజయంతి

**మే 2017**

1. పుత్రప్రాప్తివ్రతం
2. గంగాసప్తమి
3. బుధాష్టమి అపరాజితాదేవి వ్రతం
3. బగళాముఖీజయంతి
4. వాస్తుకర్తరి ప్రారంభం
5. శ్రీవాసవీజయంతి, శ్రీవీరబ్రహ్మేంద్రజయంతి తిరుచానూర్ శ్రీపద్మావతీ కళ్యాణోత్సవం
6. మోహినీఏకాదశి అన్నవరసత్యదేవకల్యాణం
7. పరశురామద్వాదశి
9. శ్రీ నృసింహజయంతి చిన్నమస్తాదేవీజయంతి
10. మహావైశాఖి,బుద్ధపూర్ణిమ, శరభజయంతి, మదర్స్‌డే, సంపద్గౌరీవ్రతం,కూర్మజయంతి శ్రీ అన్నమయ్యజయంతి
11. నిజకర్తరి ప్రారంభం
13. పార్థివకల్పాది
14. సంకష్టహరచతుర్థి వృషభసంక్రాంతి
21. శ్రీ హనుమజ్జయంతి
22. అపరైకాదశి
24. మాసశివరాత్రి
25. శనిజయంతి
26. కరవీరవ్రతం
27. జ్యేష్ఠమాసచంద్రోదయం
28. రంభావ్రతం,వాస్తుకర్తరిత్యాగం రంజాన్‌నెల ప్రారంభం
29. ఉమాచతుర్థి
30. ఆరణ్యకగౌరీవ్రతం



# కన్యారాశి

ఉత్తర 2,3,4పా (టో,పా,పి), హస్త 1,2,3,4 పా (పూ,షం,ణ,ఠ), చిత్ర 1,2పా (పే,పో)

| | |
|---|---|
| ఆదాయము | 05 |
| వ్యయము | 05 |
| పూజ్యత | 05 |
| అవమానం | 02 |

**గమనిక:** 17వపేజీలోని "రాశిఫలితాలు చదువరులకు గమనిక" అను వివరాలను చదివి, తదుపరి ఈ దిగువ ఫలితాలను చదువమని కోరడమైనది.

సెప్టెంబరు 11 వరకు గురు జన్మరాశి సంచారంచే తలచిన కార్యములకు నెరవేరును. ఊహించని సౌకర్యాలు కల్గును. అంతర్గత కలహాలు ఉండవు. సమయస్ఫూర్తి పాటిస్తారు. శరీర ఆరోగ్యంపై శ్రద్ధ ఉంచుదురు. సెప్టెంబరు 12 తదుపరి కుటుంబ అంశాలు మెరుగు పడును. అధికార దండనలుండవు. సంఘంలో గుర్తింపు లభించును. తండ్రి ఆజ్ఞలను ధిక్కరించలేరు. అనవసర విరోధాలు ఉండవు. సాహసప్రయాత్నాలు విడనాడుదురు.

శనిగ్రహ అతిచార వక్రాలను మినహాయిస్తే, 2017 అక్టోబరు 27 వరకు తేజస్సు, జ్ఞాపకశక్తి, చలాకీతనం, కేశసంపద, సాత్వికత్వం పెరుగును. వృత్తి వ్యవహారాదులలో సమస్యలున్ననూ తేరుకుంటారు. మేనమామతో పట్టింపులున్నవి. భుజాలతీపు తగ్గును. గత జన్మ విషయాలపై చర్చలు సాగిస్తారు. అక్టోబరు 27 నుంచి సంవత్సరాంతం వరకు సజ్జన సహచర్యం పెరుగును. వైదిక క్రతువులు నెరవేరుస్తారు. మోకాళ్ల విషయంలో వైద్య సేవలు తీసుకొనాలి. సోమరితనం తగ్గును. భూ లావాదేవీలలో అప్రమత్తంగా ఉండి పూర్ణలబ్ధిని పొందుతారు. స్పెక్యులేషన్ యోగించును.

గ్రహసంచార స్థితులను విశ్లేషించగా ప్రతి ప్రయత్నాలు లాభించును. శ్వాసకోశ రుగ్మతలు తగ్గును. గృహనిర్మాణ యోగమున్నది. ఇరుగుపొరుగుతో స్నేహసంబంధాలు పెరుగును. అవివాహితులకు వివాహయోగం. రాజకీయ సినీ వాసులకు ఎదురుదెబ్బలున్నవి. స్త్రీలకు విశ్రాంతి ఏర్పడును. అనవసర నిందలు తగ్గును. స్వర్ణాభరణాలపై మక్కువ పెరుగును. విద్యార్థినీ విద్యార్థులకు పూర్ణ లబ్ధి. క్రీడా కార్మికవాసులకు మానసిక ఆనందం పెరుగును. అర్ధాష్టమ శని అక్టోబరు 27 నుంచి ప్రారంభమైనదని భయం వద్దు. ఆదాయ,వ్యయాలు సమానంగా ఉన్నప్పటికీ పరోక్షంగా పూర్ణ ఫలితాలు వస్తాయని భావించండి. నమ్మకద్రోహాలు తగ్గును. మనఃక్లేశములుండవు.

మిత్రుల ద్వారా క్రొత్త వార్తలు వింటారు. మనోనిబ్బరం పెరుగును. స్పెక్యులేషన్‌లో జాగ్రత్తలు తీసుకుంటారు. ధర్మకార్యనిర్వహణపై ఆసక్తి పెరుగు తుంది. కుటుంబ చిక్కులు తగ్గును. ప్రాధాన్యత లేని వ్యక్తులను దూరంగా ఉంచుతారు. అంతర్గత విషయాలను బహిర్గతం చేయరు. శారీరక రుగ్మతకై వైద్య సలహాలను ఆలస్యంగా స్వీకరిస్తారు. నాస్తికత్వం జోలికి వెళ్లరు. దూరప్రయాణాలు బాగా యోగించును. గౌరవమర్యాదలు పెరుగును. ఎదుటి వారిపై తరచూ ఆగ్రహావేశాలను తగ్గిస్తారు.

**ఏప్రిల్:** తోబుట్టువులతో స్వల్ప విరోధం. లోభగుణం తగ్గించండి. రహస్య మంతనాలు, పట్టింపులు దూరంగా ఉంచండి. న్యాయపోరాటాలు మానండి. వాగ్ధోరణిని తగ్గించండి. స్నేహిత వర్గీయులతో ప్రశాంతంగా గడుపుదురు. స్పెక్యులేషన్ లాభించును. మాసాంతంలో శుభవార్తలు. ఏప్రిల్ 25 రాత్రి 9.55 నుంచి 27 రాత్రి 9.48 వరకు ప్రతికూలం.

**మే:** ప్రణాళికలో మార్పుచేర్పులుండును. నిర్మాణాత్మక శక్తి పెరుగును. నూతన ఆలోచనలు లాభించును. ధైర్యంతో అడుగులు వేయుదురు. స్థానచలనములుండవు. మనోవ్యాకులత్వం తగ్గును. అధికారులతో జాగ్రత్తగా ఉంటారు. శుభకార్యాచరణకు సంకేతాలు. గృహనిర్మాణానికి పావులు కదుపుదురు. జూదవ్యాపారాలు రాణించవు. మే 23 ఉదయం 8.24 నుంచి 25 ఉదయం 8.28 వరకు సమయం వ్యతిరేకము.

**జూన్ :** అనవసర ఖర్చులు పెరుగును. క్రమశిక్షణాయుత పద్ధతిని పాటిస్తారు. వాగ్దాన భంగములుండవు. అంచనాలు తారుమారు కావు. వివాద విషయాలలో తలదూర్చవద్దు. మాసం మధ్యలో స్పెక్యులేషన్ రాణింపు. సంకల్పబలం నెరవేరును. ఉదర సమస్య రాగల సూచన. జూన్ 19 సాయంత్రం 5.27 నుంచి 21 సా6.46 వరకు వ్యతిరేకం.

**జూలై :** మానసిక వత్తిడి తగ్గును. స్థిర లావాదేవీలలో లోపాలు సరిచేస్తారు. ఆదాయ గండిని పూడ్చుకుంటారు. అనవసర ఖర్చును తగ్గిస్తారు. సంతానంపై శ్రద్ధ చూపిస్తారు. వ్యక్తిగత ప్రతిష్ఠలకు వెళ్లవద్దు. పైరవీలచే లబ్ది తగ్గును. మిత్రశత్రుత్వాలను గమనించలేరు. పరనిందారోపణలు వద్దు. జూలై 16 రాత్రి 12.20 నుంచి 18 రాత్రి 3.15 వరకు జాగ్రత్తలవసరం.

**ఆగస్టు :** సోదర అంశాలు మెరుగుపడును. ఆత్మవిశ్వాసంతో ముందుకు సాగుదురు. శరీరంపై గాయాలు రాగల సూచన. ఆశ్రిత పక్షపాతం వలన నిందలు తప్పవు. పుణ్యకార్యాచరణపై మక్కువ పెరుగును. అధికారులచే నిఘా ఉన్నదని గ్రహించలేరు. స్పెక్యులేషన్ యోగం కాదు. ఆగస్టు 12 రా.తె 5.50 నుంచి 15 ఉదయం 9.35 వరకు ప్రతికూల సమయము.

**సెప్టెంబరు :** తలచిన కార్యములు ఆలస్యమగును. రాని బాకీలపై పరిష్కారాలు చేయాలి. సోమరితనం పెరుగును. శస్త్రచికిత్స ఉందని భయపడ వద్దు. హాస్యానికి వెళ్లవద్దు. నిద్రలేమి ఉండును. మాసాంతంలో ఆర్థికలబ్ధి. సంతానంచే ఆలస్యంగా శుభవార్తలు. సెప్టెంబరు 9 మ11.43 నుంచి 11 మధ్యాహ్నం 2.59 వరకు అనుకూలం కాదు.

**అక్టోబరు:** అమూల్యవిశేషాలను రహస్యంగా తెలుసుకుంటారు. ఋణ విముక్తికి మార్గం ఏర్పడును. శరీరానికి వైద్యసేవలు అవసరం. మాసం మధ్యలో స్తంభించిన వ్యవహారాలు కార్యరూపం దాల్చును. అకాల భోజనాదులు కలవు. జీవనోపాధి విషయంలో స్థిరైన నిర్ణయం ఉండును. బంధువులతో భేషజాలకు వెళ్లరు. విమర్శలను ధాటిగా ఎదుర్కొంటారు. అక్టోబరు 6 రాత్రి 7.31 నుంచి 8 రాత్రి 9.59 వరకు వ్యతిరేకం.

**నవంబరు :** కార్యబాధ్యతలను సజావుగా నిర్వహిస్తారు. అశాంతితో తీసుకున్న నిర్ణయాలు ఫలించవు. రాజీధోరణితో వెళ్లుట ఉత్తమం. సంతానంచే శుభవార్తలు. కుటుంబ కలతలు సమసిపోవును. నవంబరు 2 రా.తె 5.29 నుంచి 5 ఉదయం 6.27 వరకు తిరిగి 30 సా4.13 నుంచి డిశంబరు 2 సాయంత్రం 5.25 వరకు ప్రతికూల సమయం.

**డిశంబరు:** స్వయంరంగాల వారికి లబ్ది. రానిబాకీలపై పరిష్కారాలు తెలుసుకుందురు. శుభకార్యాలలో నూతన పరిచయాలు ఏర్పడును. పితృవర్గం వారితో స్వల్ప పేచీ. ఉద్యోగుల పైన నిఘా కలదు. హామీలచే నష్టముండును. స్తంభన కార్యాలలో విజయం. స్థానచలన అవకాశములు లేవు. డిశంబరు 27 రాత్రి 1.37 నుంచి 30 ఉ4.22 వరకు ప్రతికూలం.

**జనవరి 2018:** సంతానసౌఖ్యం కల్గును. పంతాలకు వెళ్లినందున లబ్ది తగ్గును. ఆందోళన, విసుగు అధికమగును. కపట స్వభావులు చేసే మోసంతో ఆర్థికనష్టం. మనోనిబ్బరాన్ని పెంచుకోవాలి. అసత్యాలధికము. జనవరి 24 ఉదయం 8.34 నుంచి 26 మ1.08 వరకు ప్రతికూలం.

**ఫిబ్రవరి 2018 :** రాజకీయవాసులకు అనుకూలం కాదు. శస్త్రచికిత్స రాగల సూచన. వాగ్ధోరణిలో అదుపుతప్పుదురు. స్థిరాస్తులలో లోపాలున్నవని గమనించాలి. శాంత స్వభావంతో అనుకూలతలు లభించును. ఫిబ్రవరి 20 మ2.03 నుంచి 22 రా7.21 వరకు సమయం వ్యతిరేకం.

**మార్చి 2018 :** ధైర్యం పెరిగిననూ, సమయస్ఫూర్తి లోపించును. ప్రతిభకు గుర్తింపు ఉన్ననూ మనశ్శాంతి కరువగును. మాసాంతంలో మనోక్లేశము. అంతర్గత శత్రుబెడదలు ఉండును. శక్తియుక్తులతో, హుందాతనంతో అనుకున్న కార్యాలు ఆలస్యంగా సాధిస్తారు. 2వవారంలో స్పెక్యులేషన్‌లో లబ్ధి.



# తులారాశి

చిత్ర 3,4పా (రా,రి), స్వాతి1,2,3,4పా (రూ,రే,రో,తా), విశాఖ 1,2,3పా (తీ,తూ,తే)

| | |
|---|---|
| ఆదాయము: | 02 |
| వ్యయము : | 08 |
| పూజ్యత : | 01 |
| అవమానం : | 05 |

**గమనిక:** 17వపేజీలోని "రాశిఫలితాలు చదువరులకు గమనిక" అను వివరాలను చదివి, తదుపరి ఈ దిగువ ఫలితాలను చదువమని కోరడమైనది.

సెప్టెంబరు 11 వరకు గురు వ్యయస్థాన సంచారంచే ముఖ్య వ్యవహారా లలో నిర్ణయాలు త్వరితంగా తీసుకోలేరు. మానసిక ఉ ల్లాసము తగ్గును. సంఘీభావం బంధువుల నుంచి రాగలదు. ప్రవర్తనలో అనుకూల మార్పులు ఉండును. మొక్కవోని ధైర్యంతో ముందుకు నడుచుదురు. అధికారులచే అండదండలు. సెప్టెంబరు 12 తదుపరి ఆధిపత్యపోరుకు సిద్ధమగుదురు. దీర్ఘకాల సమస్యలు పరిష్కారమగును. భూ సంబంధ లావాదేవీలతో లబ్ధి. వ్యాపారస్థులపై నిఘా ఉండును. ధర్మకార్యాలపై శ్రద్ధ చూపిస్తారు.

శనిగ్రహ అతిచార వక్రాలను మినహాయిస్తే, 2017 అక్టోబరు 27 వరకు వాగ్ధోరణిచే సమస్యలు పరిష్కారం కావు. కళత్ర అంశాలలో జాగ్రత్తలు తీసుకోవాలి. అజ్ఞాతవ్యక్తులచే రహస్య సమాచారాన్ని సేకరిస్తారు. అపనిందలు తట్టుకొని ఎదురీదగలరు. అక్టోబరు 27 తదుపరి క్రొత్త ఆలోచనలకు తెరతీస్తారు. స్థిర ఆదాయం వచ్చేలా ప్రయత్నాలు ఫలిస్తాయి. ఆంతరంగికుల సలహాలను స్వీకరిస్తారు. అకారణ విరోధాలు స్వల్పం.

గ్రహసంచార స్థితిగతులను విశ్లేషించగా నూతన వ్యవహారాలు, ఒప్పందా లచే స్వల్ప లబ్ధి. వృధా ప్రయాణాలు ఉండవు. పనిలో జాప్యమధికము. సోదర సమన్వయం లోపించును. ఆధిపత్యపోరుకై ప్రాకులాడవద్దు. ఆర్థిక లావాదేవీలపై అధిక ఆశలు ఉంచవద్దు. కీర్తి ప్రతిష్ఠలను కాపాడుకోవాల్సిన అగత్యముంది. శరీరతేజస్సు తరచూ తగ్గి, పెరుగుతుండును. సంతాన విషయాలలో ప్రతిబంధకములు ఎదురగుచుండును. శతృవులచే విషబీజములు ఉన్నవి. వ్యూహాత్మక అంశాలను నమ్మినవారికి రహస్యంగా తెలియజేయండి. బంధు అనారో గ్యంచే మనసు కకావికలం. అన్నదాతలకు ఆర్థికంగా లబ్ధి చేకూరును. రాజకీయ, సినీ, న్యాయ, క్రీడారంగాల వారికి ప్రయత్నాలు ఆలస్యంగానే ఫలిస్తాయి. విద్య, వైద్య, కర్షకరంగాల వారికి స్వల్పంగా ఊరట.

గృహంలో తరచూ వాతావరణం కలుషితమగుచుండును. ఋణ సమస్య నుంచి కొంతమేర విముక్తి లభించును. నీచులతో మాట్లాడి మనోసంకటాలు పెంచుకోవద్దు. అవసరమైతే సంజాయిషీ, క్షమాపణ లతో బయటపడటం మంచిది. మిత్రభేదం జరిగినా పరోక్షంగా ప్రయోజనం పొందుతారు. సెంటిమెంట్ బలాన్ని పెంచుకుంటారు. బుద్ధి బలంతోను, గురుబలంతోను నిర్ణయాలు తీసుకుంటూ పూర్తిస్థాయిలో లబ్ధికి దగ్గరగుదురు. పుకార్లను నమ్మి నష్టపోవద్దు. పెద్దల ఆశీస్సులు లభిస్తాయి. స్థానచలనంపై మనసును కష్టపెట్టవద్దు. తెలియని దుఃఖము మనసును వెంటాడును.

**ఏప్రిల్ :** వాగ్ధోరణిలో అనుకూల మార్పులు. బుద్ధిబలం, ఋణభారం పెరుగును. నూతన నిర్ణయాలతో గాలి పీల్చుకుంటారు. స్థిర సంభాషణల వైపు మగ్గుదురు. రహస్య అంశాలను బహిర్గతం చేయవద్దు. మార్చి 31 మ12.32 నుంచి ఏప్రిల్ 2 మధ్యాహ్నం 2.04 వరకు తిరిగి 27 రాత్రి 9.48 నుంచి 29 రాత్రి 9.45 వరకు సమయములు ప్రతికూలములు.

**మే :** మాతృవర్గీయులచే లబ్ధి. కీర్తిప్రతిష్ఠలను రక్షించుకుంటారు. వాతరోగ బాధలు 2వ పక్షంలో అధికము. ధనక్షయానికి అడ్డుకట్ట వేస్తారు. అంచనాలు తారుమారు కాకుండా చూస్తారు. ఆగ్రహావేశాలు తగ్గును. బంధువుల ఆదరణ సంపాదిస్తారు. మే 25 ఉదయం 8.28 నుంచి 27 ఉదయం 7.36 వరకు ప్రతికూల సమయమని భావించాలి.

**జూన్ :** వేధింపుజనుల విమర్శలను తట్టుకుందురు. కపట స్వభావుల మాటలకు లొంగవద్దు. రాజీధోరణిని అవలంబించాలి. స్పెక్యులేషన్‌లో తరచూ అపజయాలున్నవి. స్థిరాస్తులలో జాగ్రత్తలవసరం. భ్రాంతితో తరచూ వ్యవహరిస్తారు. 2వవారం నుంచి ఉన్నత వ్యక్తులచే కార్యసిద్ధి. జూన్ 21 సాయంత్రం 6.46 నుంచి 23 సా 6.19 వరకు ప్రతికూల సమయమని గ్రహించి అన్నీ అంశాలలో జాగ్రత్తలు తీసుకోవాలి.

**జూలై :**వివాద అంశాలపై సాహసాలు చేయవద్దు. ధనక్షయం జరుగును. ఆరోపణలు, విమర్శలు అధికం. స్వీయనిర్ణయాలు ఫలించవు. అంచనాలు తారుమారు కాగలవు. మాసం చివరలో ఆర్థికంగా లబ్ధి కల్గును. శరీర అలసత్వానికి గురిచేయవద్దు. విధి విధాన మార్పులచే విజయం చేకూరును. జూలై 18 రాత్రి 3.15 నుంచి 20 రా.తె 4.09 వరకు ప్రతికూల సమయం.

**ఆగస్టు :** న్యాయవ్యవహారాలపై మక్కువ పెంచండి. పరిష్కారం కాని సమస్య తెరపైకి వచ్చును. స్పెక్యులేషన్‌లో స్వల్ప లాభం. కఠినవాక్కులతో స్నేహితుల మనసును గాయపరుచుదురు. ఆశ్రిత పక్షపాతం పెరుగును. స్వయంవృత్తుల వారికి పురోగమనం. ఆగస్టు 15 ఉదయం 9.35 నుంచి 17 మధ్యాహ్నం 11.54 వరకు వ్యతిరేక సమయంగా గ్రహించాలి.

**సెప్టెంబరు :** స్థిరాదాయం తగ్గును. అనవసర ఖర్చులు పెరుగును. ఐననూ మనోవాంఛలు నెరవేరును. అకాల భోజనాదులుండును. సంతానంచే శుభవార్తలు. మానసికచింతన తగ్గించండి. శతృవులపై కాలుదువ్వవద్దు. ఆశాజనకంతో సమయం గడుపుదురు. సెప్టెంబరు 11 మధ్యాహ్నం 2.59 నుంచి 13 సాయంత్రం 5.44 వరకు వ్యతిరేక సమయం.

**అక్టోబరు :** సోమరితనం పెరుగును. నిర్వహణలో బాధ్యతలు పెరుగును. నిద్రలేమి, అకాల భోజనాదులు అధికము. సామరస్య ధోరణిని అవలంబిం చాలి. ఆంతరంగిక అంశాలను బహిర్గతం చేస్తారు. వీటిచే విమర్శలు, శతృ బెడదలు అధికం. మాసాంతంలో మనశ్శాంతి ఏర్పడును. స్పెక్యులేషన్ రాణింపు తక్కువ. అక్టోబరు 8 రాత్రి 9.59 నుంచి 10 రాత్రి 11.17 వరకు సమయం ప్రతికూలమని గ్రహించాలి.

**నవంబరు:**వృత్తివ్యాపారాదులలో ఇతరుల పర్యవేక్షణ చోటుచేసు కొనును. ఉదర లోపములు కలవు. మానసికవత్తిడులు, చికాకులు పెరుగును. బంధు ఐక్యానికి ప్రయత్నించండి. మాసాంతంలో ఆశాజనక పరిస్థితులు. అవివాహి తులకు శుభకాలము. ఋణసదుపాయం ఏర్పడును. నవంబరు 5 ఉ6.27 నుంచి 7 ఉ6.43 వరకు వ్యతిరేక సమయం.

**డిశంబరు :** అభివృద్ధి అంశాలపై దృష్టి పెడుదురు. మానసిక చింత తగ్గును. వ్యక్తిగత విమర్శలను తట్టుకుంటారు. ముఖ్యప్రయాణాలు రద్దు కాగలవు. డిశంబరు 2 సాయంత్రం 5.25 నుంచి 4 సాయంత్రం 4.51 వరకు తిరిగి 29 రా.తె4.22 నుంచి 31 రా.తె 4.23 వరకు ప్రతికూల సమయములని గ్రహించాలి.

**జనవరి 2018:** తోబుట్టువులు సహకరిస్తారు. విమర్శలకు దూరంగా ఉంటారు. కుటుంబ నిర్ణయాలని శిరసావహిస్తారు. దూరప్రాంత ప్రయాణాలు విజయం చేకూర్చును. సామర్థ్యం లేని వ్యక్తులచే విమర్శలు. జనవరి 26 మధ్యాహ్నం 1.08 నుంచి 28 మధ్యాహ్నం 2.53 వరకు సమయం అనుకూలం కాదని గమనించేది.

**ఫిబ్రవరి 2018 :** భాగస్వామ్య నిర్ణయాలు వాయిదా పడును. వృత్తి వ్యాపారాదులలో ఇతరుల జోక్యం పెరుగును. ఎదుటివారి బాధ్యతలను తీసుకుంటారు. స్పెక్యులేషన్ పూర్తిగా అనుకూలం కాదు. ఫిబ్రవరి 22 రాత్రి 7.21 నుంచి 24 రాత్రి 10.41 వరకు అనుకూలం కాదు.

**మార్చి 2018 :** రావలసిన బాకీలు వసూలగును. నూతన తేజస్సును పొందుదురు.ఎత్తులకు పై ఎత్తులు వేస్తారు. కళత్రంచే లబ్ధి. పుకార్లచే సమస్యలు పెరిగిననూ ధైర్యంగా ఉంటారు. వ్యాపార అంశాలలో పావులు కదుపుతారు. వాగ్దానాలు భంగము కాకుండా జాగ్రత్త పడాలి.



# వృశ్చికరాశి

విశాఖ 4పా (తో), అనూరాధ 1,2,3,4పా (నా,నీ,నూ,నే) జ్యేష్ఠ 1,2,3పా (నో,యా,యీ,యు)

| | |
|---|---|
| ఆదాయము: | 08 |
| వ్యయము : | 14 |
| పూజ్యత : | 04 |
| అవమానం : | 05 |

**గమనిక:** 17వపేజీలోని "రాశిఫలితాలు చదువరులకు గమనిక" అను వివరాలను చదివి, తదుపరి ఈ దిగువ ఫలితాలను చదువమని కోరడమైనది.

సెప్టెంబరు 11 వరకు గురు ఏకాదశస్థాన సంచారంచే పరువు, ప్రతిష్ఠ లకు భంగకరం. స్థిరాదాయం మందగించును. సమయస్ఫూర్తిని ప్రదర్శించలేరు. వాగ్ధోరణిచే సమస్యలున్నవి. వివేకంతో వ్యవహరించాలి. సెప్టెంబరు 12 నుంచి సంవత్సరాంతం వరకు పిత్రార్జిత అంశాలపై దృష్టి. స్థిరాదాయం పెరుగును. కీలకనిర్ణయాలలో ప్రధానపాత్ర పోషిస్తారు. శత్రుబెడద ఉండదు. స్థానచలన సూచనలున్నవి. అంచనాలు వాస్తవరూపం దాల్చును.

శనిగ్రహ అతిచార వక్రాలను మినహాయిస్తే, 2017 అక్టోబరు 27 వరకు చేపట్టిన కార్యక్రమాలు ఆలస్యంగా ఫలించును. మనఃక్లేశములు తగ్గును. రానిబాకీలు వసూలగును. సంయమనం పాటించలేరు. సంతాన సమస్యలకు పరిష్కారాలుండును. అక్టోబరు 27 నుంచి సంవత్సరాంతం వరకు కార్యసిద్ధికి ఆటంకాలు. ఎదుటివారిచే దూషణలుండును. కోపోద్రేకులు కావద్దు. కఠిన నిర్ణయాలు తీసుకుంటారు. మాటపట్టింపు లుండవు. స్పెక్యులేషన్ లాభించును. సంవత్సరాంతంలో శుభకార్య నిర్వహణ ఉండును.

గ్రహసంచార స్థితిగతులను విశ్లేషించగా తెలియని ఆరాటంతో పోరాటం చేయుదురు. స్థానచలన అవకాశములధికం. ఇంటాబయటా తరచూ విమర్శలు తట్టుకోవాలి. శ్వాసకోశ రుగ్మతలు అధికమయ్యే సూచన. అసత్య సంభాషణలు తరచూ వింటారు. జూదవ్యాపారాలు దారుణంగా దెబ్బతినును. హీనవ్యక్తులతో పరిచయాలు ఏర్పడి నష్టపోవుదురు. పరస్థలంలో నివాసించే పరిస్థితి కలదు. దుష్టులతో సహవాసం చేయటంతో నష్టం పెరుగును. విద్య, వైద్య, కార్మిక, కర్షక రంగాల వారికి ఊరట లభించును. రాజకీయ వాసులకు నష్టాలు అధికము.

సంగీత, సాహిత్య, న్యాయరంగాల వారికి అర్థలబ్ధి మిగులును. విద్యార్థినీ విద్యార్థులకు ఊరట కల్గును. అన్నదాత లకు 2వపంట లాభించును. కుటుంబ వ్యక్తులతో ఘర్షణలు మటుమాయమగును. అనవసర విరోధాలను సంవత్స రాంతంలో తగ్గించుకుంటారు. సంజాయిషీలు అధికంము. స్వయం వృత్తుల వారికి పూర్ణప్రాప్తి. మహిళా ఉద్యోగులకు ఖర్చులధికము. గృహిణులకు నూతన ఆలోచనలతో ధనవ్యయం. కళత్రవర్గీయుల మధ్య విభేదాలుంటే తగ్గించుకోవాలి. లేనిచో సమస్యలు పెరుగును. కోపం, నైరాశ్యాన్ని దూరంగా ఉంచాలి. మొత్తం మీద స్పెక్యులేషన్ ఆశాజనకము. ప్రయాణాలలో విసిగి వేసారుతారు. దుష్టుల సహవాసం వీలైనంతవరకు తగ్గించండి.

**ఏప్రిల్ :** కార్యసిద్ధికై ఖర్చు పెడతారు. బుద్ధిబలంతో నిర్ణయాలు తీసుకుంటారు. కార్యదీక్షాబాధ్యత పెరుగును. బంధు సమాగమంచే సమస్యలు. సమయస్ఫూర్తి ప్రదర్శిస్తారు. ఏప్రిల్ 2 మధ్యాహ్నం 2.04 నుంచి 4 సాయంత్రం 5.24 వరకు తిరిగి 29 రాత్రి 9.45 నుంచి మే 1 రాత్రి 11.36 వరకు ప్రతికూల సమయములని గ్రహించాలి.

**మే :** సోదరమైత్రి పెరుగును. నిద్రలేమిని తగ్గించండి. ప్రయాణాలలో అసౌకర్యాలు. తరచూ ఆర్థికమాంద్యం. కార్యసిద్ధికి ఆటంకాలు. గుప్తసమాచార సేకరణలో ఆలస్యం. అనవసర విషయాలలో ఇతరుల జోక్యం. రెండవపక్షంలో సమస్యల వలయాన్ని ఛేదిస్తారు. సహచరులతో అభిప్రాయబేధాలు. మే 27 ఉదయం 7.36 నుంచి 29 ఉదయం 7.56 వరకు సమయం వ్యతిరేకము.

**జూన్ :** శరీరం తరచూ అలసత్వంగా ఉండును. నిత్యం ఆశాభావం తోనే ఉంటారు. స్త్రీమూలకంగా లాభిస్తారు. ముఖ్య వ్యవహారాలు తల్లక్రిందులు కావు. అనవసర హామీలు ఇచ్చినందున వత్తిడి పెరుగును. మాసం మధ్యలో స్పెక్యులేషన్‌లో తీవ్రనష్టమున్నదని గమనించాలి. జూన్ 23 సాయంత్రం 6.19 నుంచి 25 సాయంత్రం 6.04 వరకు అన్నీ అంశాలలో జాగ్రత్తలవసరం.

**జూలై :** ప్రతిబంధక సంభాషణలచే స్వల్ప నష్టం. మనోక్లేశములుం టాయి. సంజాయిషీలు అధికం. సాహసప్రయత్నాలతో శుభకార్యాచరణ. ఉద్యోగ స్తులకు ఊరట. స్థానచలన సూచన లేదు. పట్టుదలకు పోయి భంగపడుదురు. బంధుప్రీతి అధికము. స్పెక్యులేషన్ రాణింపు. జూలై 20 రా.తె 4.09 నుంచి 22 రా.తె 4.29 వరకు ప్రతికూల సమయం.

**ఆగస్టు :** స్వీయకల్పనాశక్తి పెరుగును. జీర్ణాశయంలో సమస్య రాగల సూచన. జూద నష్టములు. హామీ సంతకాలచే ఇతరుల బెడద. అందుకు గాను సంజాయిషీలు. ఆధిపత్యపోరుకై ఉపక్రమిస్తారు. అధికారులచే సమస్య లున్నవి. జాగ్రత్త అవసరము. ఆగస్టు 17 మధ్యాహ్నం 11.54 నుంచి 19 మధ్యాహ్నం 1.37 వరకు అనుకూల సమయం కాదు.

**సెప్టెంబరు :** శుభకార్యాలకు చర్చలుండను. రాజీధోరణితో వెళ్లాలి. ఋణాన్వేషణకు సమయం కేటాయించాలి. వాహనసౌఖ్యం. మృదువాక్యాలతో ఎదుటివారిని ఆకట్టుకుంటారు. స్వవృత్తుల వారికి ఆశాజనకం. సెప్టెంబరు 13 సా5.44 నుంచి 15 రాత్రి 8.36 వరకు వ్యతిరేక సమయం.

**అక్టోబరు :** ధర్మావేశం అనుకూలం కాదు. రాజీప్రక్రియలు లాభిస్తాయి. సాహస ప్రయత్నాలు ఫలించును. రాబడి విషయంలో ఖచ్చితాన్ని పాటించలేరు. మాసం మధ్యలో శృంగభంగములు. స్వయం వృత్తుల వారికి లబ్ధి. అక్టోబరు 10 రాత్రి 11.17 నుంచి 12 రాత్రి 2.04 వరకు ప్రతికూల సమయము.

**నవంబరు :** రానీబాకీలు వసూలగును. అవివాహితులకు వివాహ యోగం. మనో వాంఛలు ఆలస్యంగా సిద్ధించును. సంతాన సమస్యలు తొలగును. మాసాంతంలో కఠిన నిర్ణయాలు తీసుకుంటారు. స్పెక్యు లేషన్‌లో స్వల్పంగా రాణింపు. నవంబరు 7 ఉదయం 6.43 నుంచి 9 ఉదయం 8.04 వరకు సమయం వ్యతిరేకమని భావించాలి.

**డిశంబరు :** చలాకీతనం పెరుగును. వివాదఅంశాలు సమసి పోవును. వృధాప్రయాణాలు ఉన్ననూ మనశ్శాంతి ఉంటుంది. స్పెక్యులేషన్ యోగించును. శరీరతేజస్సు పెరుగును. మాసాంతంలో వర్గ వైషమ్యాల జోలికి వెళ్లవద్దు. ఆలోచనా పటిమ పెరుగును. డిశంబరు 4 సాయంత్రం 4.51 నుంచి 6 సాయంత్రం 4.34 వరకు ముఖ్య అంశాలలో జాగ్రత్తలవసరం.

**జనవరి 2018 :** కృషికి తగిన ఫలితం తక్కువ. వ్యూహాత్మక ఆలోచనలు చేయాలి. హాస్యవచనాలతో అసత్యాలతో కాలం గడపలేరు. ప్రతిబంధక సమస్యలను తప్పించాలి. సామరస్యధోరణితో ముందుకు కదలాలి. గతనెల రా.తె 4.23 నుంచి జనవరి 2 రాత్రి 3.33 వరకు తిరిగి జనవరి 28 మ2.53 నుంచి 30 మ 2.59 వరకు అన్నీ విషయాలలో జాగ్రత్తలవసరం.

**ఫిబ్రవరి 2018 :** గర్వభంగములుండను. 2వవారంలో దీర్ఘకాల సమస్య పరిష్కారం. ఋణదాతల వత్తిడిపై విమర్శలు వద్దు. ఋణలావాదేవీలు తగ్గుముఖం. భయాందోళనలు విడనాడండి. ఫిబ్రవరి 24 రాత్రి 10.41 నుంచి 26 రాత్రి 12.30 వరకు సమయం అనుకూలం కాదు.

**మార్చి 2018 :** సంకల్పబలంచే లోపాలు తగ్గును. స్పెక్యులేషన్‌లో స్వల్ప లబ్ధి. రహస్య మంతనాలచే నష్టం. ఆలోచనాపటిమ పెరుగును. ఉదర లోపములున్నవి. కీలకనిర్ణయాలలో జాగ్రత్తలు అవసరము. సంతానానికి విజయప్రాప్తి. ఆశ్రిత పక్షపాతంచే విమర్శల వెల్లువ. బంధుసహాయం కలదు.



# ధనూరాశి

మూల 1,2,3,4పా (యే,యో,బా,బి), పూర్వాషాఢ 1,2,3,4పా (భూ,ధ,భా,ఢ) ఉత్తరాషాఢ 1పా(భే)

| | |
|---|---|
| ఆదాయము: | 11 |
| వ్యయము : | 05 |
| పూజ్యత : | 07 |
| అవమానం : | 05 |

**గమనిక:** 17వపేజీలోని "రాశిఫలితాలు చదువరులకు గమనిక" అను వివరాలను చదివి, తదుపరి ఈ దిగువ ఫలితాలను చదువమని కోరడమైనది.

సెప్టెంబరు 11 వరకు గురు దశమస్థాన సంచారంచే చలాకీతనం, వందనీయత, సాత్వికత్వంతో ఉంటారు. రోగనిరోధక శక్తి పెరుగును. కీలక అంశాలపై దృష్టిని పూర్తిస్థాయిలో ఉంచలేరు. క్రొత్త నిర్ణయాలపై మొగ్గు చూపవద్దు. సెప్టెంబరు 12 నుంచి సంవత్సరాంతం వరకు మనోవాంఛలు ఆలస్యంగా సిద్ధించును. గర్వభంగములున్నవి. మనఃక్లేశములు, ప్రతిబంధక ములు తరచూ ఎదురగును. శౌర్యము తగ్గును. మతిమరపు పెరుగును. అకాల భోజనాదులు ఉండును. స్థానచలన అవకాశములున్నవి.

శనిగ్రహ అతిచార వక్రాలను మినహాయిస్తే, 2017 అక్టోబరు 27 వరకు నూతన మార్గాలతో, తెలివితేటలతో, పరిశోధనాశక్తితో, సంతాన విజయాలతో ముందుకు వెళ్లాలి అనుకుంటారు. ఆలోచనలకి తరచూ గండి పడిననూ నిదానంగా సాఫల్యమగును. వాహనస్థితిపై పథకం సిద్ధం చేస్తారు. అక్టోబరు 27 నుంచి సంవత్సరాంతం వరకు నిర్ణయాలలో తొట్రుపాటు. లౌకిక విషయాలపై శ్రద్ధ చూపలేరు. ఏలినాటిశని జన్మభాగం ఈ తేదీ నుంచే ప్రారంభమగును. భయాందోళనలు వద్దు. శత్రువులలో కూడా మిత్రులు ఉన్నారని గమనిస్తారు. విసుగు, కోపాన్ని తగ్గించండి.

గ్రహసంచార స్థితులను విశ్లేషించగా స్వీయనిర్ణయాలు ఫలించవు. అంచనాలు తారుమారు. స్వయంవృత్తుల వారికి లబ్ధి. వ్యాపార, రాజకీయ, కార్మిక రంగాలకు వెసులుబాటు. క్రీడ, న్యాయరంగాల వారికి వ్యూహాత్మక శక్తులు పెరుగును. విద్యార్థినీ విద్యార్థులకు మనోనిబ్బరం పెరుగును. అన్న దాతలకు నష్టం వాటిల్లదు. ఉద్యోగ మహిళలకు గౌరవమర్యాదలకు భంగం వాటిల్లదు. గృహిణులకు హాస్యవచనాలతో, అసత్యాలతో ఉండేవారు తోడవుతారు. కానీ జాగ్రత్త వహించాలి.

దైవకార్యాచరణపై మొగ్గు చూపుదురు. అవివాహితులకు శుభవార్తలున్నవి. ముఖ్య విషయాలలో రాజీ అవసరము. పట్టుదలకు వెళ్లి భంగపడవద్దు. జాయింటు వ్యాపారాలు సజావుగా సాగును. శతృబెడద నవంబరు, డిశంబరులో అధికము. కఠినవాక్కులు తగ్గించి, సమయ స్ఫూర్తిని పెంచండి. హామీసంతకాలచే ఆర్థిక నష్టముంది. నీచ ఆలోచనలు తగ్గిస్తారు. మేధాశక్తి పెరుగును. జీర్ణాశయ లోపములు రాగల సూచన. దూరప్రాంత ప్రయాణాలు లబ్ధినిస్తాయి. స్పెక్యులేషన్ గొప్పగా యోగించదు. ఆచితూచి సంవత్సరం అంతా సంభాషిస్తుండాలి. స్త్రీమూలక లబ్ధి కలదు. బంధు సహాయం ఏర్పడును.

**ఏప్రిల్ :** మనోసంకటాలు మటుమాయం. గృహనిర్మాణ పనులు శ్రద్ధగా ఆచరిస్తారు. వాహనచోదకంలో జాగ్రత్త. సంతానరీత్యా ఖర్చులు పెరుగును. మాసం మధ్యలో లోపాలు తలెత్తును. మిత్రబేధాలుండును. బంధువులతో శతృత్వాలు వద్దు. అనవసర ఆవేశాలకు వెళ్లకండి. ఏప్రిల్ 4 సాయంత్రం 5.24 నుంచి 6 రాత్రి 11.00 వరకు అనుకూల సమయం కాదని గమనించి...జాగ్రత్తతో నూతన నిర్ణయాలు తీసుకోవాలి.

**మే :** ఖచ్చిత నిర్ణయాలు తీసుకుందురు. తల్లి ప్రేమచే నిర్ణయాలలో మార్పులుండును. కీర్తి ప్రతిష్ఠలు పెరిగటంతో ఆర్థిక జాగ్రత్తలవసరం. శుభ వార్తలు వింటారు. శతృభయం ఉండదు. పరనింద ఆరోపణలను దూరం చేస్తారు.మే 1 రాత్రి 11.36 నుంచి 3 రా.తె4.29 వరకు తిరిగి 29 ఉదయం 7.56 నుంచి 31 మ11.14 వరకు ప్రతికూల సమయమని భావించి...అన్నీ అంశాలలో జాగ్రత్తలు తీసుకోవాలి.

**జూన్ :** శుభకార్య నిర్వహణ చర్చలు ఫలించును. విమర్శలుండవు. పూర్తిగా అనుకూల స్థితిగతులు. జాయింట్ వ్యాపారాలలో పురోగతి. అధర్మ కార్యాలను ఆపుదురు. శరీరానికి వైద్యసేవలు. మాస ప్రారంభంలో స్పెక్యులేషన్ నష్టం. చలాకీతనం కళాకాంతులు పెరుగును. జూన్ 25 సాయంత్రం 6.04 నుంచి 27 రాత్రి 7.58 వరకు సమయం వ్యతిరేకం.

**జూలై :** వాహనసౌఖ్యం లాభించును. కపట స్వభావులు ఎదురగుదురు. వారిని ఆర్థికంగా ఆదుకోవద్దు. శుభచర్చలు కలసి వస్తాయి. 3వ వారంలో మానసిక చింతలచే రహస్యాలను బయటపెట్టకండి.జూలై 22 రా.తె 4.29 నుంచి 25 ఉదయం 6.01 వరకు ప్రతి అంశంలో జాగ్రత్త వహిస్తూ నిర్ణయాలు తీసుకుంటూ ఉండాలి.

**ఆగస్టు :** ఆర్థికమాంద్యం, ఋణబాధలు అధికం. హడావుడి నిర్ణయాలచే నష్టం. వ్యాపారాలలో ముందంజ. రాబడి విషయంలో ఖచ్చిత నిర్ణయం తీసుకోలేరు. ఉద్యోగ నిర్వహణలో సమస్యలు 3వ వారంలో ఉంటాయి. స్నేహ సంబంధాలు పెంచుకుంటారు. ఆగస్టు 19 మధ్యాహ్నం 1.37 నుంచి 21 మధ్యాహ్నం 3.51 వరకు ప్రతికూల సమయం.

**సెప్టెంబరు :**మనోసంకటాలు ఉండవు. వ్యూహాత్మక శక్తి పెరుగును. ఆర్థికమాంద్యం ఉండదు. సాహసకృత్యములకు దూరమగుదురు. వివాద అంశాలు ఉండవు. శస్త్రచికిత్సకు అవకాశముంది. 4వవారంలో బంధువులతో జాగ్రత్తగా సంభాషించాలి. సెప్టెంబరు 15 రాత్రి 8.36 నుంచి 17 రాత్రి 12.07 వరకు ముఖ్య అంశాలలో జాగ్రత్తలు అవసరం.

**అక్టోబరు :** కృతనిశ్చయం బలంగా ఉండదు. బుద్ధిబలంతో నిర్ణయాలు ఉంటాయి. వాదనా శక్తి వృద్ధి. స్పెక్యులేషన్ ఆశాజనకం. తోబుట్టువులతో మాటపట్టింపులు. కుటుంబ కలతలు తగ్గుముఖం. భాగస్వామ్య నిర్ణయాలలో మార్పులు. అక్టోబరు 12 రాత్రి 2.04 నుంచి 15 ఉదయం 6.21 వరకు అనుకూల సమయం కాదని గ్రహించాలి.

**నవంబరు:** తోబుట్టువులతో అంగీకారముంది. ఉపాధిరంగాల వారికి అనుకూలం. శరీరానికి వైద్య సేవలు అవసరం. కుటుంబ వాతావరణంలో వ్యతిరేకతలు. ధర్మావేశం అనుకూలం కాదు. జూదవ్యాపారంచే నష్టం. కృత నిశ్చయంతో ధైర్యంగా ఉంటారు. నవంబరు 9 ఉదయం 8.04 నుంచి 11 మధ్యాహ్నం 11.43 వరకు వ్యతిరేక సమయం.

**డిశంబరు:** కుటుంబ సమస్యలు గట్టెక్కును. అకారణ విరోధాలుండవు. నీలాపనిందలు తగ్గును. గురుతర బాధ్యతను స్వీకరించలేరు. బుద్ధిబల నిర్ణయాలతో పూర్ణలబ్ధి. రహస్య అంశాలపై చర్చలు వద్దు. సంజాయిషీలు, క్షమాపణలు మామూలే. డిశంబరు 6 సాయంత్రం 4.34 నుంచి 8 సాయంత్రం 6.28 వరకు నిర్ణయాలు తీసుకోవటంలో తొందరపాటు వద్దు.

**జనవరి 2018:** ఊహించని ఖర్చులు వచ్చిననూ వెనుకంజ వేయరు. భూలావాదేవీలు సాధారణ స్థితి గనుక ఆత్మవిశ్వాసంతో ఉండండి. జనవరి 2 రాత్రి 3.33 నుంచి 4 రాత్రి 3.54 వరకు తిరిగి 30 మ 2.59 నుంచి ఫిబ్రవరి 1 మ3.06 వరకు సమయాలు వ్యతిరేకమని గ్రహించాలి.

**ఫిబ్రవరి 2018 :** స్వయంరంగాలలో విజయప్రాప్తి. మాసం మధ్యనుంచి హడావుడి ప్రయాణాలు, అకాలభోజనాదులు. ఆకస్మిక విజయప్రాప్తి. సంతాన సౌఖ్యం. స్పెక్యులేషన్ రాణింపు లేదు. ఫిబ్రవరి 26 రాత్రి 12.30 నుంచి 28 రాత్రి 1.45 వరకు అనుకూల సమయం కాదని గ్రహించి...నూతన అంశాలలో జాగ్రత్తలు తీసుకోవాలి.

**మార్చి 2018 :** న్యాయ అంశాలపై పట్టుదలకు పోవద్దు. భాగస్వామ్య నిర్ణయాలు నెరవేరును. బంధువుల ఆదరణ సంపాదిస్తారు. అవివాహితులకు వివాహయోగం. నూతన నిర్ణయాలు తీసుకుంటారు. మాసాంతంలో ఆర్థిక పరిపుష్టి. వాగ్దాన నిర్ణయాలు మారును. ఆశ్రిత పక్షపాతం పెరుగును.



# మకరరాశి

ఉత్తరాషాఢ 2,3,4పా(భో,జా,జి),శ్రవణం 1,2,3,4పా (జూ,జె,జో,ఖ) ధనిష్ఠ 1,2,పా (గా,గి)

| | | |
|---|---|---|
| ఆదాయము | : | 14 |
| వ్యయము | : | 14 |
| పూజ్యత | : | 03 |
| అవమానం | : | 01 |

**గమనిక:** 17వపేజీలోని "రాశిఫలితాలు చదువరులకు గమనిక" అను వివరాలను చదివి, తదుపరి ఈ దిగువ ఫలితాలను చదువమని కోరడమైనది.

సెప్టెంబరు 11 వరకు గురు నవమస్థాన సంచారంచే జీవనసౌఖ్యం ఏర్పడును. రహస్యమంతనాలకు స్వస్తి చెబుతారు. ఋణసమస్యలుండవు. చలాకీతనం, శౌర్యం పెరుగును. రోగనిరోధకశక్తి తగ్గును. సెప్టెంబరు 12 నుంచి సంవత్సరాంతం వరకు గురువు దశమస్థాన సంచారంచే మార్పు చేర్పులు అధికంగా ఉండును. వ్యక్తిగత ప్రతిష్ఠలు పెరుగును. ఋణ సమస్యలు పీడించవు. జాయింటు నిర్ణయాలు లాభించును. స్వపక్షీయుల బెడద తగ్గును. అనవసర జగడాలకు వెళ్లరు. నిద్రలేమి అధికము. మనోవ్యాకులత పెరుగును.

శనిగ్రహ అతిచార వక్రాలను మినహాయిస్తే, 2017 అక్టోబరు 27 వరకు ఆర్థికచిక్కులతో విసుగు, ఆందోళన పెరుగును. కీలకనిర్ణయాలలో ప్రధానపాత్రను పోషించలేరు. న్యాయపోరాటం మానుకుంటారు. అంచనాలు వాస్తవరూపం దాల్చవు. కానీ ఆత్మవిశ్వాసం తగ్గదు. అక్టోబరు 27 నుంచి ఏలినాటి శని 1వభాగం ప్రారంభమగును. స్పెక్యులేషన్ లాభించును. సోమరితనం పెరుగును. జాయింటు నిర్ణయాలు తరచూ వాయిదా పడును. జీవనోపాధి నిర్ణయంలో అస్థిరత్వాలు చోటుచేసుకొనును. వాగ్ధోరణి తగ్గించాలి.

గ్రహసంచార స్థితిగతులను పరిశీలించగా కోపం, నైరాశ్యం ఉంటాయి. కపటస్వభావులు దూరంగా ఉండాలి. రక్త సంబంధీకులచే శుభవార్తలున్ననూ మనసులో తెలియని బాధ పెరుగును. ఆర్థికమాంద్యం అధికము. అంతర్గత కలహాలను తగ్గించే ప్రయత్నం చేస్తారు. అన్యుల ద్వారా ఆలస్యంగా మాట సాయం అందును. బంధుప్రీతిని స్వాగతిస్తారు. ఆదాయంతో సమానంగా వ్యయం కూడా నడుస్తుంది. క్షమాపణలు తరచుగా చెప్తుంటారు. విద్య, వైద్య, రవాణా రంగాలవారికి ఊహించని ఖర్చులు. సంగీత, సాహిత్య, న్యాయ, క్రీడావాసులకు ఋణభారం పెరుగును. విద్యార్థినీ విద్యార్థులకు గతం కంటే మెరుగైన ఫలితాలుంటాయి.

అన్నదాతలకు ఊహించని ఆనందం తటస్థించును. ఉద్యోగ మహిళలు హడావుడి నిర్ణయాలతో ఉద్యోగ బాధ్యతలను మర్చిపోతారు. గృహిణులు కీలకనిర్ణయాలను తీసుకోలేరు. శస్త్రచికిత్సకు అవకాశం ఉంది. మిత్రభేదంతో మంతనాలు జరుపవద్దు. సంవత్సరం మధ్య నుంచి సంతాన సౌఖ్యం లభించును. అవివాహితులకు అనుకూల కాలం. వైరాగ్యపు ధోరణి విడనాడుదురు. నిద్రాసౌఖ్యం పెరుగును. మౌనానికి అధికప్రాధాన్యం ఇస్తారు. సాహసప్రయత్నాలు మానుకుంటారు. ఆధిపత్య సంభాషణలకు స్వస్తి పలుకుదురు. వాస్తవాలను కప్పి, లబ్ధి చేకూర్చు ప్రయత్నాలపై దృష్టి మానుకోవాలి.

**ఏప్రిల్ :** దినచర్యలో తరచూ మార్పులుండును. సమయస్ఫూర్తి, సంయమనం పాటించలేరు. శుభకార్య చర్చలు వాయిదా. స్వవృత్తుల వారికి ఆశాభంగ ములున్నవి. సహాయ సహకారాలపై ఆలోచనలు అధికం చేయాలి. స్పెక్యులేషన్ ఫర్వాలేదు. ఏప్రిల్ 6 రాత్రి 11.00 నుంచి 9 ఉదయం 6.53 వరకు ముఖ్యవిషయాలలో జాగ్రత్తలు తీసుకోవాలి.

**మే :** ఆర్థిక నష్టం పూడ్చుకుంటారు. వాస్తవ విషయాలలో గోప్యం ఉండును. ఋణ సమస్యలు స్వల్పంగా పెరుగును. హామీలకై సమయం వృథా చేయాలి. నిస్వార్థ సేవను అందించినందున ధనవ్యయం. మే 4 ఉదయం 4.29 నుంచి 6 మ12.33 వరకు తిరిగి 31 మ11.14 నుంచి జూన్ 2 సా 6.22 వరకు ప్రతికూల సమయాలుగా భావించాలి.

**జూన్:** సంతానసౌఖ్యముండును. ఆర్థిక స్థితి పెరుగును. న్యాయనిర్ణయాలు అవసరము. విమర్శలకు అపనిందలకు దూరంగా ఉంటారు. వివాద వ్యాఖ్యలపై మౌనం వహించండి. చంచలత్వం తగ్గును. జూన్ 27 రాత్రి 7.58 నుంచి 29 రాత్రి 1.37 వరకు అనుకూల సమయం కాదని గ్రహించాలి.

**జూలై :** విజయవార్తా శ్రవణం. స్తంభించిన వ్యవహారాలు లాభించును. సోదర సంఘీభావం పెరుగును. దైవ కార్యాలపై శ్రద్ధ చూపిస్తారు. వివాదాలు సర్దుమణుగును. ఆర్థిక ఇక్కట్లు తగ్గును. ముఖ్య వ్యక్తికి పెద్దపీట వేయుదురు. జూలై 25 ఉదయం 6.01 నుంచి 27 ఉదయం 10.28 వరకు ప్రతికూలం.

**ఆగస్టు :** స్థానచలన అవకాశములు కలవు. పంతాలకు పట్టింపులకు వెళ్లవద్దు. రోగ బాధలకు ఉపశమనం. పాలనా నిర్ణయాలలో లోపాలను సరిచేసుకుంటారు. భయాందోళనలు విడనాడుదురు. కుటుంబ నిర్ణయాలు లాభించును. ఆగస్టు 21 మ3.51 నుంచి 23 రాత్రి 8.03 వరకు వ్యతిరేకమని గమనించాలి.

**సెప్టెంబరు :** మాసం మధ్య నుంచి ఆర్థిక లావాదేవీలలో పెను మార్పులుండును. ఉద్యోగ అంశాలలో సంజాయిషీలుండును. అవివాహితులకు అనవసర ప్రయాణాలు. హడావుడి నిర్ణయాలతో ధననష్టం. స్వయంవృత్తుల వారికి పూర్తి ఆశాజనక స్థితి. సెప్టెంబరు17 రాత్రి 12.07 నుంచి 19 రా.తె 5.01 వరకు నిదానమే ప్రధానంగా భావించాలి.

**అక్టోబరు :** సాహసకార్యాలపై దృష్టి పెంచుదురు. రహస్య సమాలోచనలు సాగిస్తారు. ముఖ్యవిషయాలలో హామీలు తీసుకుంటారు. చేదు అనుభవాలను తిప్పి కడుదురు. ఎదుటివారిపై విమర్శలు చేయవద్దు. జాయింట్ వ్యాపార నిర్ణయాలు వాయిదాపడును. అక్టోబరు 15 ఉదయం 6.21 నుంచి 17 మధ్యాహ్నం 12.18 వరకు ప్రతికూల సమయమని గ్రహించాలి.

**నవంబరు :** ఆత్మవిశ్వాసంతో ముందుకు సాగాలి. ధైర్య సాహసాలతో లబ్ధి కల్గును. అనవసర సంజాయిషీలు ఇవ్వవద్దు. భేషజాలకు వెళ్లవద్దు. వాగ్దానాల జోరును పెంచవద్దు. ఋణభారం తగ్గును. శాంత స్వభావంతో అనుకూలత లభించును. నవంబరు 11 మధ్యాహ్నం 11.43 నుంచి 13 సాయంత్రం 6.02 వరకు అనుకూలం కాదు.

**డిశంబరు :** బుద్ధిబలంతో నిర్ణయాలు తీసుకుని విమర్శలను తట్టుకుంటారు. ఆర్భాట వ్యవహారాలకు దూరంగా ఉండాలి. జీవన సరళిపై నూతన ఆలోచనలు. కుటుంబ కలతలుండవు. వ్యక్తిగత ప్రతిష్ఠలను పెంచుకుంటారు. మానసిక చింతలు తొలగును. డిశంబరు 8 సా 6.28 నుంచి 10 రాత్రి 11.43 వరకు ప్రతికూల సమయం.

**జనవరి 2018 :** మేధాశక్తితో నూతన మార్గాలను అన్వేషిస్తారు. మానసిక వత్తిడి తగ్గును. అనవసర ఖర్చు తగ్గి ఆదాయం పెరుగును. అమావాస్యకు ముందు వెనుకలలో స్వల్పంగా వాగ్దాన భంగములు. నూతన ప్రణాళికలను సిద్ధం చేయవద్దు. జనవరి 4 రాత్రి 3.54 నుంచి 7 ఉదయం 7.17 వరకు సమయం వ్యతిరేకమని గ్రహించాలి.

**ఫిబ్రవరి 2018 :** సెటిల్‌మెంట్ వ్యవహారంలో సమస్య ఉన్ననూ ఆర్థికంగా లాభిస్తారు. రాజీ ధోరణికి కట్టుబడరు. సంతానంపై శ్రద్ధ చూపిస్తారు. కీలక నిర్ణయాలు మాసాంతంలో తీసుకోలేరు. వాహన మరమ్మత్తులకు ధనవ్యయం. ముఖ్య కారణాలచే ప్రయాణాల రద్దు. ఫిబ్రవరి 1 మ3.06 నుంచి 3 సా5.10 వరకు అనుకూలం కాదు.

**మార్చి 2018 :** స్పెక్యులేషన్ లబ్ధి కాదు. ఆదాయగండిని ఇతర మార్గాలలో పూడ్చుకుంటారు. అకాల భోజనాదులు తప్పవు. మాసాంతంలో స్థానచలన అవకాశములు. కళత్ర విభేదములున్నవి. అకాలభోజనాదులచే అనారోగ్యం. గత నెల 28 రాత్రి 1.45 నుంచి మార్చి 2 రాత్రి 3.49 వరకు ప్రతికూల సమయంగా భావించాలి.



# కుంభరాశి

ధనిష్ఠ 3,4 పా (గూ,గే), శతభిషం 1,2,3,4పా (గో,సా,సీ,సూ), పూర్వాభాద్ర 1,2,3పా (సే,సో,దా)

| | |
|---|---|
| ఆదాయము: | 14 |
| వ్యయము : | 14 |
| పూజ్యత : | 06 |
| అవమానం : | 01 |

**గమనిక:** 17వపేజీలోని "రాశిఫలితాలు చదువరులకు గమనిక" అను వివరాలను చదివి, తదుపరి ఈ దిగువ ఫలితాలను చదువమని కోరడమైనది.

సెప్టెంబరు 11 వరకు గురు అష్టమస్థాన సంచారంచే వాదోపవాదాలు తగ్గుముఖం. విమర్శలు, నిందలుండవు. వాస్తవ విషయాలను కప్పి పుచ్చుతారు. ఆధిపత్య సంభాషణలతో కార్యసిద్ధి. పితృనిర్ణయాలపై ఆసక్తి పెంచుదురు. సెప్టెంబరు 12 నుంచి సంవత్సరాంతం వరకు గురువు నవమస్థాన సంచారంచే దీర్ఘాలోచనలు చేసిననూ చేదు అనుభవాలు మిగులును. చలాకీతనం, కళాకాంతులు పెరుగును. మిత్రభేదం ఉండదు. అనవసర ధన క్షయ ముండదు. వ్యూహాత్మక నిర్ణయాలు చేయగలరు

శనిగ్రహ అతిచార వక్రాలను మినహాయిస్తే, 2017 అక్టోబరు 27 వరకు రాజీధోరణికి ప్రాధాన్యత ఇస్తారు. ఋణభారం తగ్గును. స్నేహ సంబంధాలు పెరుగును. వాస్తవ విషయాలను కప్పి ఉంచలేరు. బహిర్గతం చేస్తారు. గతం గతః అనుకుంటూ జీవనోపాధికై నూతన నిర్ణయాలను తీసు కుంటారు. గురుతర బాధ్యతను స్వీకరిస్తారు. అక్టోబరు 27 నుంచి సంవత్స రాంతం వరకు స్థానచలన సూచనలున్నవి. నిరుత్సాహం, భయం తగ్గును, నరాల భుజాల తీపు రాగల సూచన. అవివాహితులకు శుభవార్తలు.

గ్రహసంచార స్థితిగతులను విశ్లేషించగా ఆర్థికమాంద్యమధిము. ఉద్యోగ నిర్వహణలో పాత నిర్ణయాలకే మొగ్గు చూపుతారు. సోదర వర్గీయులతో అభిప్రాయబేధాలు. సాత్వికంతో ఉన్నందున విమర్శలు, అపనిందలు తగ్గును. రోగనిరోధక శక్తి పెరుగటంతో పాటు వ్యక్తిగత గౌరవం కూడా పెరుగును. రాజకీయ, క్రీడావాసులకు రహస్య సమాలోచనలు సమస్యలను తెస్తాయి. విద్యార్థినీ విద్యార్థులకు సృజనాత్మక శక్తి పెరుగును. సంగీత, సాహిత్య, కంప్యూటర్ వాసులలో మనస్పర్ధలు రాజ్యమేలుతుంటాయి. మంగళ కార్యము లకు తెరతీస్తారు. వాదనాశక్తి తగ్గును. ఉద్యోగ మహిళలు స్థిర నిర్ణయాలు తీసుకుంటారు. గృహిణులకు వ్యాపారంపై ఆసక్తి పెరుగును.

ప్రతిబంధక సమస్యలు అధికంగా ఉన్నందున వివాద విషయాలవైపు కన్నెత్తి చూడరు. సాహసనిర్ణయాలు తగ్గిస్తారు. స్పెక్యులేషన్ నష్టదాయకం. శతృభయంచే ఆందోళన, వత్తిడులు పెరుగును. అన్యుల ద్వారా సహాయం చాలా తక్కువ. సంజాయిషీలు, క్షమాపణలు తరచుగా చెప్పుకుంటారు. ఏకాదశ శని కొంతవరకు మాత్రమే లబ్ధిని అందిస్తాడు. ఆదాయానికి తగ్గట్లుగా వ్యయం ఉంటుంది. మనసును దిటవు చేసుకుని రోజులు గడపాలి. శస్త్ర చికిత్సకు అవకాశముంది. స్వయంవృత్తుల వారికి రాణింపు ఉండును.

**ఏప్రిల్ :** స్వయంరంగాల వారికి విజయప్రాప్తి. అలౌకిక విషయాలపై ఆసక్తి పెరుగును. శుభకరచర్చలచే లబ్ధి. వ్యక్తిగత ప్రతిష్ఠలచే ధనవ్యయం. కళత్రభోగం పరిఢవిల్లును. స్పెక్యులేషన్‌లో స్వల్ప లాభం. భాగస్వామ్య నిర్ణయాలలో మార్పులధికం. ఏప్రిల్ 9 ఉదయం 6.53 నుంచి 11 సాయంత్రం 4.40 వరకు ముఖ్యఅంశాలలో జాగ్రత్తలు తీసుకోవాలి.

**మే :** రహస్య మంతనాలు తగ్గించాలి. సంతానానికి సహాయం అందిస్తారు. మాసం మధ్యలో హడావుడి ప్రయత్నాలు.రాజీధోరణితో వెళ్లుట ఉత్తమం. పరిష్కారం కాని సమస్యకు మోక్షం కల్గును. సోదరులతో చికాకులున్నవి. చంచలత్వం తగ్గించుకోండి. ఆరోగ్యంపై శ్రద్ధ చూపించాలి. మే 6 మధ్యాహ్నం 12.33 నుంచి 8 రాత్రి 10.53 వరకు ఆచితూచి వ్యవహరించాలి.

**జూన్ :** విశేష వ్యక్తుల పరిచయాలు పెరుగును. అవివాహితులకు శుభ వార్తలు. బంధువులతో ఐక్యత పెరిగి ఆదాయం పెరుగును. శతృవర్గీయులను తక్కువ అంచనా వేయవద్దు. శారీరక అలసట పెరుగును. జూన్ 2 సాయంత్రం 6.22 నుంచి 4 రా.తె 4.36 వరకు తిరిగి 29 రాత్రి 1.37 నుంచి జూలై 2 ఉదయం 10.55 వరకు ప్రతికూల సమయమని భావించాలి.

**జూలై :** కీలక నిర్ణయాలలో ముఖ్య పాత్రధారిగా వద్దు. గౌరవ మర్యాదలను కాపాడు కుంటారు. సాత్వికత్వం, చలాకీతనం, చిరుమంద హాసాలతో ఇతరులను ఆకర్షిస్తారు. ఋణ బాధలుండవు. పెద్ద వ్యక్తుల పరిచయాలకై శ్రద్ధ చూపిస్తారు. రహస్య సమాచారాన్ని సేకరిస్తారు. జూలై 27 ఉదయం 10.28 నుంచి 29 సాయంత్రం 6.32 వరకు అనుకూల సమయం కాదు.

**ఆగస్టు :** భూలావాదేవీలు ఫలించను. శతృపీడ తగ్గును. ఆర్థిక విషయాలలో హామీలు ఇవ్వవద్దు. కార్యసిద్ధికి ఆటంకములున్నవి. దూర ప్రయాణాలు రద్దగును. స్వవృత్తుల వారికి మేలైన వార్తలచే విజయప్రాప్తి. స్థానచలన ఆశలు నిరాశలగును. ఆగస్టు 23 రాత్రి 8.03 నుంచి 25 రాత్రి 3.14 వరకు అన్నీ అంశాలలో జాగ్రత్తలు తీసుకోవాలి.

**సెప్టెంబరు :** కపటస్వభావులు తరచూ ఎదురగుదురు. ధర్మావేశం అను కూలం కాదు. విధి విధానాలలో అధిక మార్పులు. వ్యూహాత్మక నిర్ణయాలను తీసుకోలేరు. వాగ్ధోరణిని అదుపు చేయండి. సంతానసౌఖ్యం కల్గును. స్నేహ సంబంధాలు పెరుగును. సెప్టెంబరు 19 రా.తె 5.01 నుంచి 22 మధ్యాహ్నం 12.06 వరకు వ్యతిరేక సమయంగా భావించాలి.

**అక్టోబరు :** ఆర్థికచిక్కులు, విసుగు, ఆందోళన పెరుగును. దైవకార్యాచరణపై ఆసక్తి చూపుదురు. పరువు, ప్రతిష్ఠలకు భంగకరం. ఉద్యోగాదులలో ప్రతికూలతలు స్వల్పంగా పెరుగును.పిత్రార్జిత అంశాలపై దృష్టి అధికం చేయాలి. పాలనా శక్తులు తగ్గును. అక్టోబరు 17 మ12.18 నుంచి 19 రాత్రి 8.03 వరకు ఆవేశాలకు లోనుకావద్దు.

**నవంబరు :** శతృవర్గ వైషమ్యాల బెడద ఉంది. అసత్య ఆరోపణలు చేయవద్దు. శుభకార్యా చరణకు అనుకూలం. చేసిన తప్పును కప్పిపుచ్చవద్దు. ప్రధాన శతృవులు ఆరాతీసి పరువు తీస్తారు. నవంబరు 13 సాయంత్రం 6.02 నుంచి 15 రాత్రి 2.32 వరకు ప్రతికూల సమయమని గ్రహించాలి.

**డిశంబరు :** గుప్త సమాచారాన్ని సేకరిస్తారు. శుభసంకేతాలు అందును. ఆర్థికమాంద్యం ఉండదు. ఆత్మవిశ్వాసం పెరుగును. శత్రువులపై విజయం సాధిస్తారు. ముఖ్య ప్రయాణాలు లాభించును. డిశంబరు 10 రాత్రి 11.43 నుంచి 13 ఉదయం 8.08 వరకు సమయం వ్యతిరేకమని భావించాలి.

**జనవరి 2018 :** రెండవ పక్షంలో వ్యూహాత్మకంగా పావులు కదపాలి. నేత్ర దంత రుగ్మతలు ఏర్పడు సూచన. ఎదుటివారిపై ఆగ్రహావేశాలు తగ్గి స్తారు. కళత్రంచే ఖర్చులధికం. పరనిందారోపణలచే సమస్యలున్నవి. స్పెక్యులేషన్ యోగవంతం కాదు. జనవరి 7 ఉదయం 7.17 నుంచి 9 మధ్యాహ్నం 2.25 వరకు వరకు వ్యతిరేక సమయం.

**ఫిబ్రవరి 2018 :** మిత్ర శతృత్వాలు గమనించి 3వవారంలో నిర్ణయాలు తీసుకోవాలి. సాహస ప్రయత్నాలతో ధననష్టం. స్వీయ కల్పనాశక్తి పెంచండి. స్వవృత్తుల వారికి ఆశాజనకం. కాలిపిక్కలకు రుగ్మత ఏర్పడును. స్పెక్యులేషన్ ఆశాజనకం. ఫిబ్రవరి 3 సాయంత్రం 5.10 నుంచి 5 రాత్రి 10.35 వరకు అనుకూల సమయం కాదు.

**మార్చి 2018 :** ఆర్థిక చిక్కులు తగ్గును. ఆచితూచి సంభాషించుటచే కార్యసిద్ధి. స్థిరాదాయం మందగించును. మాసాంతంలో కుటుంబకలతలు సర్దుమణుగును. ఈ మాసంలో స్పెక్యులేషన్ అసలు వద్దు. మార్చి 2 రాత్రి 3.49 నుంచి 5 ఉదయం 8.17 వరకు ప్రతికూల సమయం.



# మీనరాశి

పూర్వాభాద్ర 4పా (దీ), ఉత్తరాభాద్ర 1,2,3,4పా (దూ,ఇ,ఝ,థా), రేవతి 1,2,3,4పా (దే,దో,చా,చి)

| | |
|---|---|
| ఆదాయము | 11 |
| వ్యయము | 05 |
| పూజ్యత | 02 |
| అవమానం | 04 |

**గమనిక:** 17వపేజీలోని "రాశిఫలితాలు చదువరులకు గమనిక" అను వివరాలను చదివి, తదుపరి ఈ దిగువ ఫలితాలను చదువమని కోరడమైనది.

సెప్టెంబరు 11 వరకు గురు సప్తమస్థాన సంచారంచే స్పెక్యులేషన్ యోగిం చును. కళత్రయోగమధికము. అపజయాలుండవు. హాస్యానికి దూరంగా ఉంటారు. రావల్సిన బాకీలు వసూలగును. సెప్టెంబరు 12 నుంచి అష్టమ స్థానంలో గురు సంచారంచే అవివాహితులకు వివాహయోగం. వేధింపు జనులు తగ్గిపోతారు. ఎత్తులకు పైఎత్తులు వేయగలరు. ఓర్పుకి ప్రాధాన్యత ఇస్తారు. వివేకంతో వ్యవహరిస్తారు.

శనిగ్రహ అతిచార వక్రాలను మినహాయిస్తే, 2017 అక్టోబరు 27 వరకు కుటుంబ చిక్కులు పరిష్కారమగును. మనసును అదుపులో ఉంచు కుంటారు. విదేశీవ్యక్తుల సన్నిహితం పెరుగును. సాహసంతో ప్రతి పని చేసి లబ్ధి పొందుతారు. అక్టోబరు 27 నుంచి సంవత్సరాంతం వరకు అంతరాత్మ విరుద్ధంగా నిర్ణయాలు తీసుకొనరు. శతృబాధలు తగ్గును. ముఖ్య అంశాలకు హామీలుండరు. మిత్ర శతృత్వములు గమనించి మసలుకొంటారు. కష్టపడి పనులు నెరవేర్చుకుంటారు. జూదవ్యాపారములు అనుకూలం కావు.

గ్రహసంచార స్థితులను విశ్లేషించగా దీర్ఘకాల సమస్యలు పరిష్కార మగును. మాతృవర్గం వారితో అన్యోన్యత పెరుగును. అవివాహితులకు వివాహయోగం. జాయింటు వ్యాపారాలు అనుకూలిస్తాయి. అధిక ఆదాయాన్ని కాపాడుకొనే ప్రయత్నాలు చేయటంలో సఫలం చెందుతారు. ఊహకి అందని అంశాలపై దృష్టి ఉంచుతారు. సోదర సంఘీభావం తక్కువ. మానసిక విశ్రాంతి అవసరము. విద్యార్థినీ విద్యార్థులకు విసుగు ఉండకూడదు. విద్య, వైద్య, న్యాయరంగాల వారికి అనుకూలతలు సాధారణం. రాజకీయ వాసులు చేసిన పనే మళ్లీ మళ్లీ చేయాలి. ఉద్యోగ స్త్రీలకు ఆదాయం తృప్తికరం. సాధారణ గృహిణులకు ఆదాయం సాధారణమే. వర్గవైషమ్యాల నుంచి బయటపడే ప్రయత్నాలలో స్వయంరంగాల వారు విజయం సాధిస్తారు.

ఆధిపత్య పోరును తగ్గిస్తారు. సంతాన అంశాలపై అవకాశాలు మెండగును. ఆశ్రిత పక్షపాతం వలన విమర్శలు ఉన్నాయి. కళత్ర సలహాలతో విజయం సాధిస్తారు. ప్రాధాన్యత లేని వ్యక్తులను దూరంగా ఉంచుతారు. పాత జ్ఞాపకా లను నెమరువేసుకుంటారు. ఆంతరంగికుల సలహాలను కొంతే స్వీకరిస్తారు. కోపతాపాలను కట్టి పెడతారు. వృధా ప్రయాణాలుండవు. స్పెక్యులేషన్ దూకుడును అరికడతారు. శరీర తేజస్సు పెరుగును. మనోవాంఛలు సిద్ధించును. కలహాలకు దూరంగా ఉంటారు. ఋణభారం తగ్గిపోవును.

**ఏప్రిల్ :** ఆత్మవిశ్వాసంతో ముందుకు సాగుదురు. శరీరంపై గాయాలు వచ్చే అవకాశం. స్థిరాస్తి అంశాలలో నిదానంగా నిర్ణయాలుండును. స్పెక్యులేషన్ రాణించదు. లాభార్జనకై నూతన ఆలోచనలు చేయుదురు. మోకాళ్ల రుగ్మత ఏర్పడును. ఏప్రిల్ 11 సాయంత్రం 4.40 నుంచి 13 రా.తె 4.06 వరకు ముఖ్య అంశాలలో తొందరపాటు వద్దు.

**మే :** ఆశ్రిత పక్షపాతంచే నిందలు తప్పవు. భేషజాలకు వెళ్లి సంజాయిషీలు ఇచ్చుకుంటారు. చలాకీతనం, వందనీయత, సాత్వికత్వం పెరుగును. శాంత స్వభావంతో అనుకూలత లభించును. విమర్శలను తట్టుకుంటారు. సంతానం తప్పుదారి పట్టకుండా జాగ్రత్త పడుదురు. మే 8 రాత్రి 10.53 నుంచి 11 ఉదయం 10.38 వరకు సమయం అనుకూలం కాదు.

**జూన్:** శుభకార్య నిర్వహణ సిద్ధించును. సంతాన అంశాలలో లాభిస్తాయి. న్యాయ పోరాటాలు వద్దు. సోదర సఖ్యతకు ప్రణాళిక సిద్ధమగును. ప్రధాన శత్రువుల ఆరాపై ధనవ్యయమగును. స్పెక్యులేషన్‌కు దూరంగా ఉంటారు. ఆత్మవిశ్వాసంతో, సమయస్ఫూర్తితో విజయప్రాప్తి. జూన్ 4 రా.తె4.36 నుంచి 7 సా 4.36 వరకు వ్యతిరేక సమయం.

**జూలై :** ప్రతిబంధక సమస్యలుండవు. దంపతుల మధ్య అన్యోన్యత మందగించును. ప్రతిపనిలో నాన్చుడు అధికము. శరీర అలసత్వమెక్కువ. నూతనమార్పులకై అన్వేషిస్తారు. కలహాలకు దూరంగా ఉంటారు. జూలై 2 ఉదయం 10.55 నుంచి 4 రాత్రి 10.44 వరకు తిరిగి 29 సాయంత్రం 6.32 నుంచి 31 రా.తె 5.40 వరకు అనుకూలం కాదు.

**ఆగస్టు :** ఆడంబరాలకు ధనవ్యయం. ముఖ్యవ్యక్తులతో బేదాభిప్రాయాలు. ఆలోచనలకు, కోరికలకు పదునుపెడుదురు. అంతర్గత శతృబెడదలధికం. పాపపుణ్య విచక్షణచే మనస్తాపం. మాసం మధ్యలో శుభవార్తలు వింటారు. రాని బాకీలపై శ్రద్ధ చూపుతారు. ఆగస్టు 25 రాత్రి 3.14 నుంచి 28 మధ్యాహ్నం 1.33 వరకు ప్రతికూల సమయం.

**సెప్టెంబరు :** ప్రణాళికలలో మార్పుచేర్పులుండును. నిర్మాణాత్మక శక్తి పెరుగును. నూతన ఆలోచనలు లాభించును. అకాలభోజనాదులున్నవి. జీవనోపాధి విషయంలో స్థిరత్వం లోపించును. సోదర అంశాలు మెరుగు పడును. స్పెక్యులేషన్ రాణింపు ఉంది. సెప్టెంబరు 22 మధ్యాహ్నం 12.06 నుంచి 24 రాత్రి 9.53 వరకు వ్యతిరేక సమయం.

**అక్టోబరు :** సంతాన శుభకార్య చర్చలు సఫలము. పుణ్యకార్యాచరణపై మక్కువ పెరుగును. స్పెక్యులేషన్‌లో స్వల్ప నష్టం. ఆదాయానికి మించిన ఖర్చులు. శారీరక సంఘర్షణలు అధికం. పంతాలకు వెళ్లకండి. అవివాహితులకు వివాహయోగం. మాసాంతంలో ఆర్థిక పుష్టి. అక్టోబరు 19 రాత్రి 8.03 నుంచి 21 రా.తె 5.51 వరకు ప్రతికూల సమయం.

**నవంబరు :** ఖచ్చిత నిర్ణయాలు తీసుకుంటారు. సమయస్ఫూర్తిని పాటిస్తారు. వాగ్దానభంగములు తగ్గును. మాసం మధ్య నుంచి శుభవార్తలుండును. కుటుంబకలహాలు పెరగకుండా జాగ్రత్త పడతారు. క్షమాపణలు, సంజాయి షీలకు దూరమగుదురు. బంధు ఆదరణ కలదు. నవంబరు 15 రాత్రి 2.32 నుంచి 18 మధ్యాహ్నం 12.51 వరకు అనుకూల సమయం కాదు.

**డిశంబరు :** 2వ పక్షంలో నిర్ణయాలు స్థిరంగా ఉంటాయి. ఆందోళనలు తగ్గును. ఆరోపణలు, విమర్శలు తగ్గించాలి. చలాకీతనం, కళాకాంతులు పెరుగును. మొదటి పక్షంలో బుద్ధిబలంతో నిర్ణయాలు తీసుకోవాలి. డిశంబరు 13 ఉ8.08 నుంచి 15 సా6.54 వరకు ప్రతికూల సమయమని గ్రహించి నిదానమే ప్రధానంగా భావిస్తూ ఉండాలి.

**జనవరి 2018 :** వృత్తి వ్యాపారాదులలో కార్యసిద్ధి. ఋణ ప్రయత్నాలు ఫలించును. పూచీకత్తుకై సంతకాలు పెడుదురు. అశాంతి ఉండదు. రహస్య చర్చలు ఫలించును. అవివాహితులకు వివాహయోగం. జనవరి 9 మధ్యా హ్నం 2.25 నుంచి 11 రాత్రి 12.50 వరకు ప్రతికూల రోజులు అని భావించి..నూతన అంశాలలో జాగ్రత్త వహించాలి.

**ఫిబ్రవరి 2018 :** వివాదాంశాలలో తలదూర్చవద్దు. ఆత్మవిశ్వాసం పెంచాలి. స్వయంవృత్తుల వారికి ఆశాజనకం. రాజీ ధోరణికి ప్రాధాన్యత ఇస్తారు. కళత్ర నిర్ణయాలచే నూతన కొనుగోళ్లు. ఫిబ్రవరి 5 రాత్రి 10.35 నుంచి 8 ఉదయం 7.49 వరకు వ్యతిరేక సమయమని గ్రహించి..అన్నీ అంశాలలో జాగ్రత్తలవసరం.

**మార్చి 2018 :** స్నేహిత వర్గీయులతో ప్రశాంతత. న్యాయ వాయిదాలకై సమయం కేటాయింపు. మాసాంతంలో ఆశలు, నిరాశలు కావు. పరోపకారం, సత్సాంగత్యం పెరుగును. మిత్రశతృత్వాలు గమనిస్తారు. స్పెక్యులేషన్ వైపు దృష్టి ఉంచరు. మార్చి 5 ఉదయం 8.17 నుంచి 7 సాయంత్రం 4.12 వరకు అనుకూల సమయం కాదు.

| న్యూయార్క్ | | శ్రీ హేమలంబ (2017) చైత్రమాసం | | మార్చి - ఏప్రిల్ |
|---|---|---|---|---|
| **మార్చి 28 మంగ** | **29 బుధ** | **30 గురు** | **31 శుక్ర** | **ఏప్రిల్ 1 శని** |
| సూర్యోదయం:ఉ6.50<br>సూర్యాస్తమం:రా7.12<br>శ్రీ హేమలంబ చైత్రమాసారంభం<br>శు.పాడ్యమి:రా8.14<br>రేవతి:రా2.09<br>వర్జ్యం:మ3.10-4.38<br>దుర్ము:ఉ9.18-10.08<br>రా11.50-12.37<br>రా.కా:సా4.06-5.39<br>శ్రీ హేమలంబ ఉగాది | సూర్యోదయం:ఉ6.48<br>సూర్యాస్తమం:రా7.13<br>శు.విదియ:సా5.16<br>అశ్వని:రా11.54<br>వర్జ్యం:రా8.17-9.44<br>దుర్ము:మ12.36-1.25<br>రా.కా:మ1.01-2.34 | సూర్యోదయం:ఉ6.46<br>సూర్యాస్తమం:రా7.14<br>శు.తదియ:మ2.12<br>భరణి:రా9.36<br>వర్జ్యం:ఉ8.35-10.02<br>దుర్ము:ఉ10.56-11.45<br>మ3.55-4.45<br>రా.కా:మ2.34-4.07 | సూర్యోదయం:ఉ6.45<br>సూర్యాస్తమం:రా7.15<br>శు.చవితి:మ11.10<br>కృత్తిక:రా7.23<br>వర్జ్యం:ఉ8.29-9.57<br>దుర్ము:ఉ9.15-10.05<br>మ1.25-2.15<br>రా.కా:మ11.26-1.00 | సూర్యోదయం:ఉ6.43<br>సూర్యాస్తమం:రా7.16<br>శు.పంచమి:ఉ8.19<br>శు.షష్ఠి:తె5.46<br>రోహిణి:సా5.24<br>వర్జ్యం:రా10.37-12.06<br>దుర్ము:ఉ6.43-8.24<br>రా.కా:ఉ9.51-11.26 |
| **2 ఆది** | **3 సోమ** | **4 మంగళ** | **5 బుధ** | **6 గురు** |
| సూర్యోదయం:ఉ6.42<br>సూర్యాస్తమం:రా7.17<br>శు.సప్తమి:తె3.35<br>మృగశిర:మ3.44<br>వర్జ్యం:రా11.42-1.13<br>దుర్ము:సా5.36-6.27<br>రా.కా:సా5.43-7.17 | సూర్యోదయం:ఉ6.40<br>సూర్యాస్తమం:రా7.18<br>శు.అష్టమి:రా1.50<br>ఆర్ద్ర:మ2.30<br>వర్జ్యం:రా2.06-3.39<br>దుర్ము:మ1.24-2.15<br>మ3.56-4.47<br>రా.కా:ఉ8.15-9.49 | సూర్యోదయం:ఉ6.38<br>సూర్యాస్తమం:రా7.19<br>శు.నవమి:రా12.33<br>పునర్వసు:మ1.42<br>వర్జ్యం:రా9.35-11.10<br>దుర్ము:ఉ9.10-10.01<br>రా11.50-12.35<br>రా.కా:సా4.09-5.44<br>శ్రీరామనవమి | సూర్యోదయం:ఉ6.37<br>సూర్యాస్తమం:రా7.20<br>శు.దశమి:రా11.45<br>పుష్యమి:మ1.22<br>వర్జ్యం:రా2.15-3.51<br>దుర్ము:మ12.33-1.24<br>రా.కా:మ12.58-2.34 | సూర్యోదయం:ఉ6.35<br>సూర్యాస్తమం:రా7.21<br>శు.ఏకాదశి:రా11.24<br>ఆశ్లేష:మ1.30<br>వర్జ్యం:రా1.47-3.26<br>దుర్ము:ఉ10.50-11.42<br>మ3.57-4.48<br>రా.కా:మ2.34-4.10<br>కామదాఏకాదశి |
| **7 శుక్ర** | **8 శని** | **9 ఆది** | **10 సోమ** | **11 మంగళ** |
| సూర్యోదయం:ఉ6.33<br>సూర్యాస్తమం:రా7.22<br>శు.ద్వాదశి:రా11.30<br>మఖ:మ2.04<br>వర్జ్యం:రా10.24-12.04<br>దుర్ము:ఉ9.07-9.59<br>మ1.24-2.15<br>రా.కా:మ11.22-12.58 | సూర్యోదయం:ఉ6.32<br>సూర్యాస్తమం:రా7.23<br>శు.త్రయోదశి:రా11.59<br>పుబ్బ:మ3.03<br>వర్జ్యం:రా10.39-12.21<br>దుర్ము:ఉ6.32-8.15<br>రా.కా:ఉ9.45-11.21<br>శనిత్రయోదశి | సూర్యోదయం:ఉ6.30<br>సూర్యాస్తమం:రా7.24<br>శు.చతుర్దశి:రా12.52<br>ఉత్తర:సా4.24<br>వర్జ్యం:రా1.24-3.07<br>దుర్ము:సా5.41-6.33<br>రా.కా:సా5.48-7.24 | సూర్యోదయం:ఉ6.29<br>సూర్యాస్తమం:రా7.26<br>చైత్రపూర్ణిమ:రా2.07<br>హస్త:సా6.08<br>వర్జ్యం:రా2.49-4.33<br>దుర్ము:మ1.23-2.15<br>మ3.58-4.50<br>రా.కా:ఉ8.06-9.43<br>హనుమద్విజయోత్సవం | సూర్యోదయం:ఉ6.27<br>సూర్యాస్తమం:రా7.27<br>బ.పాడ్యమి:తె3.44<br>చిత్ర:రా8.12<br>వర్జ్యం:రా2.21-4.07<br>దుర్ము:ఉ9.03-9.55<br>రా11.50-12.34<br>రా.కా:సా4.12-5.49 |
| **12 బుధ** | **13 గురు** | **14 శుక్ర** | **15 శని** | **16 ఆది** |
| సూర్యోదయం:ఉ6.26<br>సూర్యాస్తమం:రా7.28<br>బ.విదియ:తె5.40<br>స్వాతి:రా10.36<br>వర్జ్యం:తె4.49లగాయితు<br>దుర్ము:మ12.31-1.23<br>రా.కా:మ12.57-2.34 | సూర్యో:6.24సూర్యా:7.29<br>బ.తదియ:పూర్తిగా<br>విశాఖ:రా1.17<br>వర్జ్యం:శేషం ఉ6.36వరకు<br>తె5.46లగాయితు<br>దుర్ము:ఉ10.46-11.38<br>మ3.59-4.52<br>రా.కా:మ2.34-4.12<br>మేషసంక్రాంతి,తమిళసంవత్సరాది | సూర్యోదయం:ఉ6.23<br>సూర్యాస్తమం:రా7.30<br>బ.తదియ:ఉ7.53<br>అనూరాధ:తె4.10<br>వర్జ్యం:శేషం ఉ7.33వరకు<br>దుర్ము:ఉ9.00-9.52<br>మ1.22-2.15<br>రా.కా:మ11.18-12.56<br>సంకష్టహరచతుర్థి | సూర్యోదయం:ఉ6.21<br>సూర్యాస్తమం:రా7.31<br>బ.చవితి:ఉ10.18<br>జ్యేష్ఠ:పూర్తిగా<br>వర్జ్యం:ఉ10.28-12.16<br>దుర్ము:ఉ6.21-8.06<br>రా.కా:ఉ9.38-11.17 | సూర్యోదయం:ఉ6.19<br>సూర్యాస్తమం:రా7.32<br>బ.పంచమి:మ12.45<br>జ్యేష్ఠ:ఉ7.09<br>వర్జ్యం:సా4.07-5.55<br>దుర్ము:సా5.46-6.39<br>రా.కా:సా5.53-7.32 |
| **17 సోమ** | **18 మంగళ** | **19 బుధ** | **20 గురు** | **21 శుక్ర** |
| సూర్యోదయం:ఉ6.18<br>సూర్యాస్తమం:రా7.33<br>బ.షష్ఠి:మ3.06<br>మూల:ఉ10.03<br>వర్జ్యం:ఉ8.15-10.03<br>రా8.42-10.29<br>దుర్ము:మ1.22-2.15<br>సా4.01-4.54<br>రా.కా:ఉ7.57-9.37 | సూర్యోదయం:ఉ6.16<br>సూర్యాస్తమం:రా7.34<br>బ.సప్తమి:సా5.07<br>పూర్వాషాఢ:మ12.41<br>వర్జ్యం:రా9.24-11.09<br>దుర్ము:ఉ8.56-9.49<br>రా11.50-12.33<br>రా.కా:సా4.15-5.54 | సూర్యోదయం:ఉ6.15<br>సూర్యాస్తమం:రా7.35<br>బ.అష్టమి:సా6.36<br>ఉత్తరాషాఢ:మ2.50<br>వర్జ్యం:రా7.06-8.48<br>దుర్ము:మ12.28-1.22<br>రా.కా:మ12.55-2.35 | సూర్యోదయం:ఉ6.14<br>సూర్యాస్తమం:రా7.36<br>బ.నవమి:రా7.24<br>శ్రవణం:సా4.21<br>వర్జ్యం:రా8.29-10.08<br>దుర్ము:ఉ10.41-11.34<br>సా4.02-4.55<br>రా.కా:మ2.35-4.15 | సూర్యోదయం:ఉ6.12<br>సూర్యాస్తమం:రా7.37<br>బ.దశమి:రా7.24<br>ధనిష్ఠ:సా5.06<br>వర్జ్యం:రా12.17-1.53<br>దుర్ము:ఉ8.53-9.47<br>మ1.21-2.15<br>రా.కా:మ11.14-12.55 |

| న్యూయార్క్ | శ్రీ హేమలంబ (2017) చైత్ర, వైశాఖమాసాలు | | | ఏప్రిల్-మే |
|---|---|---|---|---|
| **22 శని** | **23 ఆది** | **24 సోమ** | **25 మంగళ** | **26 బుధ** |
| సూర్యోదయం:ఉ6.11<br>సూర్యాస్తమం:రా7.38<br>బ.ఏకాదశి:సా6.34<br>శతభిషం:సా5.02<br>వర్జ్యం:రా11.13-12.45<br>దుర్ము:ఉ6.11-7.58<br>రా.కా:ఉ9.33-11.13<br>**వరూధినీ ఏకాదశి** | సూర్యోదయం:ఉ6.09<br>సూర్యాస్తమం:రా7.39<br>బ.ద్వాదశి:సా4.56<br>పూర్వాభాద్ర:సా4.10<br>వర్జ్యం:రా1.08-2.38<br>దుర్ము:సా5.51-6.45<br>రా.కా:సా5.58-7.39<br>**త్రయోదశి ప్రదోషం** | సూర్యోదయం:ఉ6.08<br>సూర్యాస్తమం:రా7.40<br>బ.త్రయోదశి:మ2.34<br>ఉత్తరాభాద్ర:మ2.35<br>వర్జ్యం:రా1.30-2.58<br>దుర్ము:మ1.21-2.15<br>సా4.03-4.58<br>రా.కా:ఉ7.49-9.31 | సూర్యోదయం:ఉ6.06<br>సూర్యాస్తమం:రా7.41<br>బ.చతుర్దశి:మ11.38<br>రేవతి:మ12.25<br>వర్జ్యం:లేదు<br>దుర్ము:ఉ8.49-9.44<br>రా11.51-12.32<br>రా.కా:సా4.17-5.59 | సూర్యోదయం:ఉ6.05<br>సూర్యాస్తమం:రా7.42<br>చైత్ర అమావాస్య:ఉ8.15<br>**వైశాఖ శు.పాడ్యమి:తె4.39**<br>అశ్వని:ఉ9.50<br>వర్జ్యం:ఉ6.16-7.41<br>సా6.18-7.43<br>దుర్ము:మ12.26-1.21<br>రా.కా:మ12.54-2.36 |
| **27 గురు** | **28 శుక్ర** | **29 శని** | **30 ఆది** | **మే 1 సోమ** |
| సూర్యోదయం:ఉ6.04<br>సూర్యాస్తమం:రా7.43<br>శు.విదియ:రా12.59<br>భరణి:ఉ7.01<br>కృత్తిక:తె4.09<br>వర్జ్యం:సా6.35-7.00<br>దుర్ము:ఉ10.37-11.32<br>సా4.05-4.59<br>రా.కా:మ2.36-4.18 | సూర్యో:6.02సూర్యా:7.44<br>శు.తదియ:రా9.25<br>రోహిణి:రా1.27<br>వర్జ్యం:సా6.21-7.46<br>దుర్ము:ఉ8.47-9.42<br>మ1.21-2.15<br>రా.కా:మ11.11-12.53<br>**అక్షయతదియ** | సూర్యోదయం:ఉ6.01<br>సూర్యాస్తమం:రా7.45<br>శు.చవితి:సా6.09<br>మృగశిర:రా11.03<br>వర్జ్యం:ఉ6.29-7.56<br>దుర్ము:ఉ6.01-7.51<br>రా.కా:ఉ9.27-11.10 | సూర్యోదయం:ఉ6.00<br>సూర్యాస్తమం:రా7.46<br>శు.పంచమి:మ3.19<br>ఆర్ద్ర:రా9.07<br>వర్జ్యం:ఉ6.47-8.15<br>దుర్ము:సా5.56-6.51<br>రా.కా:ఉ6.03-7.46 | సూర్యోదయం:ఉ5.59<br>సూర్యాస్తమం:రా7.47<br>శు.షష్ఠి:మ1.01<br>పునర్వసు:రా7.46<br>వర్జ్యం:తె3.32-5.05<br>దుర్ము:మ1.21-2.16<br>సా4.06-5.02<br>రా.కా:ఉ7.42-9.26 |
| **2 మంగళ** | **3 బుధ** | **4 గురు** | **5 శుక్ర** | **6 శని** |
| సూర్యోదయం:ఉ5.57<br>సూర్యాస్తమం:రా7.48<br>శు.సప్తమి:మ11.21<br>పుష్యమి:రా7.03<br>వర్జ్యం:లేదు<br>దుర్ము:ఉ8.44-9.39<br>రా11.51-12.32<br>రా.కా:సా4.21-6.04 | సూర్యోదయం:ఉ5.56<br>సూర్యాస్తమం:రా7.49<br>శు.అష్టమి:ఉ10.21<br>ఆశ్లేష:సా6.59<br>వర్జ్యం:ఉ7.49-9.24<br>దుర్ము:మ12.25-1.20<br>రా.కా:మ12.53-2.37<br>**సీతాజయంతి** | సూర్యోదయం:ఉ5.55<br>సూర్యాస్తమం:రా7.50<br>శు.నవమి:ఉ9.59<br>మఘ:రా7.32<br>వర్జ్యం:ఉ7.16-8.54<br>తె3.55-5.35<br>దుర్ము:ఉ10.33-11.29<br>సా4.08-5.03<br>రా.కా:మ2.37-4.21 | సూర్యోదయం:ఉ5.54<br>సూర్యాస్తమం:రా7.51<br>శు.దశమి:ఉ10.14<br>పుబ్బ:రా8.39<br>వర్జ్యం:తె4.20లగాయితు<br>దుర్ము:ఉ8.41-9.37<br>మ1.20-2.16<br>రా.కా:మ11.08-12.53 | సూర్యోదయం:ఉ5.53<br>సూర్యాస్తమం:రా7.52<br>శు.ఏకాదశి:మ11.00<br>ఉత్తర:రా10.15<br>వర్జ్యం:శేషంఉ6.02వరకు<br>దుర్ము:ఉ5.53-7.45<br>రా.కా:ఉ9.22-11.07<br>**మోహినీఏకాదశి** |
| **7 ఆది** | **8 సోమ** | **9 మంగళ** | **10 బుధ** | **11 గురు** |
| సూర్యోదయం:ఉ5.51<br>సూర్యాస్తమం:రా7.53<br>శు.ద్వాదశి:మ12.12<br>హస్త:రా12.14<br>వర్జ్యం:ఉ7.21-9.04<br>దుర్ము:సా6.01-6.57<br>రా.కా:సా6.08-7.53<br>**త్రయోదశి ప్రదోషం** | సూర్యోదయం:ఉ5.50<br>సూర్యాస్తమం:రా7.54<br>శు.త్రయోదశి:మ1.46<br>చిత్ర:రా2.32<br>వర్జ్యం:ఉ9.00-10.45<br>దుర్ము:మ1.20-2.17<br>సా4.09-5.06<br>రా.కా:ఉ7.36-9.21<br>**శ్రీ నృసింహజయంతి** | సూర్యోదయం:ఉ5.49<br>సూర్యాస్తమం:రా7.55<br>శు.చతుర్దశి:మ3.37<br>స్వాతి:తె5.05<br>వర్జ్యం:ఉ8.43-10.30<br>దుర్ము:ఉ8.38-9.35<br>రా11.52-12.32<br>రా.కా:సా4.24-6.10 | సూర్యోదయం:ఉ5.48<br>సూర్యాస్తమం:రా7.56<br>వైశాఖ పూర్ణిమ:సా5.42<br>విశాఖ:పూర్తిగా<br>వర్జ్యం:మ11.19-1.06<br>దుర్ము:మ12.24-1.21<br>రా.కా:మ12.52-2.38<br>**బుద్ధపూర్ణిమ** | సూర్యోదయం:ఉ5.47<br>సూర్యాస్తమం:రా7.57<br>బ.పాడ్యమి:రా7.58<br>విశాఖ:ఉ7.49<br>వర్జ్యం:మ12.18-2.06<br>దుర్ము:ఉ10.30-11.27<br>సా4.11-5.07<br>రా.కా:మ2.38-4.25 |
| **12 శుక్ర** | **13 శని** | **14 ఆది** | **15 సోమ** | **16 మంగళ** |
| సూర్యోదయం:ఉ5.46<br>సూర్యాస్తమం:రా7.58<br>బ.విదియ:రా10.21<br>అనూరాధ:ఉ10.43<br>వర్జ్యం:సా5.01-6.49<br>దుర్ము:ఉ8.36-9.33<br>మ1.21-2.17<br>రా.కా:మ11.06-12.52 | సూర్యోదయం:ఉ5.45<br>సూర్యాస్తమం:రా7.59<br>బ.తదియ:రా12.47<br>జ్యేష్ఠ:మ1.41<br>వర్జ్యం:రా10.40-12.28<br>దుర్ము:ఉ5.45-7.39<br>రా.కా:ఉ9.19-11.05 | సూర్యో:5.44సూర్యా:8.00<br>బ.చవితి:తె3.08<br>మూల:సా4.38<br>వర్జ్యం:మ2.51-4.38<br>తె3.22-5.09<br>దుర్ము:సా6.06-7.03<br>రా.కా:సా6.13-8.00<br>**సంకష్టహరచతుర్థి, వృషభసంక్రాంతి** | సూర్యోదయం:ఉ5.43<br>సూర్యాస్తమం:రా8.01<br>బ.పంచమి:తె5.16<br>పూర్వాషాఢ:రా7.27<br>వర్జ్యం:తె4.16లగాయితు<br>దుర్ము:మ1.21-2.18<br>సా4.12-5.10<br>రా.కా:ఉ7.30-9.18 | సూర్యోదయం:ఉ5.42<br>సూర్యాస్తమం:రా8.02<br>బ.షష్ఠి:పూర్తిగా<br>ఉత్తరాషాఢ:రా9.56<br>వర్జ్యం:శేషంఉ6.02వరకు<br>మ2.16-4.00<br>దుర్ము:ఉ8.34-9.32<br>రా11.54-12.32<br>రా.కా:సా4.27-6.15 |

